*
* *

# అంకితము

*

‘వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి, లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి’ అన్నాడు శాస్త్రకారుడు. ఆయన హృదయము పుష్పమువలె కోమలము, వజ్రమువలె కఠినము. చేయుచున్నది జిల్లాసర్జను ఉద్యోగము. ‘అయితేనేమి ఈవచ్చే జిల్లాజడ్జి, ఇంజనీయరు నాకుపరిచితులు క్రిందనే లెక్క: మీవంటివారే నాకు ముఖ్యమైన, ఆప్తులైన మిత్రులు’ అన్నాడాయన ఒకప్పుడు. ఒకసారి ఎవరో ఒకరిని గూర్చి చెప్పినాను, సంశయభావముతో: ‘నేను మీకు మిత్రుడను, మీరు నాకు మిత్రులు. మిత్రులు కనుకనే నాపై మీకు స్నేహబద్ధమైన అధికారము కలదు. మిత్రులు కనుకనే మీరు చెప్పిన పని చేయుట నాధర్మము. మీకు సందేహమెందుకు’ అన్న మిత్రుడాయన. అట్టి పరమమిత్రుడైన మేజరు ఎ. కృష్ణమూర్తి బి. యె., యం. బి. సి. యం., ఎ. ఐ. ఆర్. ఒ., గారికి ఈ నాగ్రంథమును విమలరాగమున, వినీతభావమున సమర్పించుచున్నాను.

న. వెం. రత్నం

* *
*

*
* *

I inscribe this book to

My Friend

MAJOR A. KRISHNAMURTY, B.A., M.B.C.M., A.I.R.O.,

Superintendent, Royapettah Hospital,

MADRAS,

In token of my personal regard.

* *
*

## పరిచయవాక్యాలు :

ఇందలి కథలన్నియు 1927 నుండి 31 వరకు వ్రాసినవి. జాగ్రత్తచేయక పోవడముచేత అప్పుడు వ్రాసిన వానిలో కొన్ని పోయినవి, కొన్నిమాత్రమే దొరికినవి. అయితే, ఇవన్నీ స్వంతముగా ఆలోచించి, మననముచేసి వ్రాసినవే కాని ఇందు అనువాదము, అనుకరణము ఎంతమాత్రములేదు. చదవడమయితే వాఙ్మయమున నోబుల్ బహుమతి పొందిన నట్ హాంసెన్ (1920), జారన్‌సన్ (1903), థామస్‌మేన్ (1929), గ్రేజియా డెలిడా (1926), షా (1925), రోమెయిన్‌రోలాం (1915), ఎనటోల్‌ఫ్రాన్సు (1921), హాప్టమన్ (1912), లేగర్లాఫ్ (1909) సిగ్రిడ్ అండ్ సెట్ (1928) మొదలైనవారి ఉద్గ్రంథాలు, సుప్రసిద్ధ పాశ్చాత్య రచయితలైన డాస్టివిస్కీ, మేక్సింగోర్కీ, టర్గినీవు, జేమ్సుబారీ, యెమిల్ లడ్విగ్, వాల్టరుడిలామేరీ, థియోడర్ డ్రెయిజర్, రసెల్, ఇబ్సన్, మెరిడిత్, ప్రీస్లీ, హ్యూవాల్‌పోల్ మొదలైన వారి వెన్నో చదివినాను. అవి మనస్సులో జీర్ణమైపోయి వేరురూపము పొంది ఉండవలె. హార్డీ, షెల్లీలపైగల అభిమానముచేత ఈకథలలోని ఒకరిద్దరు వ్యక్తులకు ఇంగ్లీషుపేళ్లు పెట్టాను. ఏమైనా నాకు తోచినది వ్రాసి లోకమునకు వినయభావమున అర్పించుట నాధర్మము.

వానిలో ఏమైనా ఉత్కృష్టత ఉంటేనే అవి నిలుస్తవి, లేకపోతే.........

ఇక—అన్ని విషయాలలోను మనము వెనుకబడి ఉన్నామనేమాట వేరే చెప్పవలెనా! శాస్త్రాలలో, రాచకీయములో మనము చాలా క్రిందిమెట్టుమీదనే ఉండిపోయాము. భూతకాలములో చాలా గొప్పవాళ్లమని చెప్పుకొని ఏమిప్రయోజనము! వర్తమానమున ఎల్లాఉన్నాము, మన భవిష్యత్తు ఎల్లాఉంది! అని చూస్తే, ఏడువేలమైళ్ల దూరాన్నుంచి వర్తకం చేయడానికివచ్చిన పరదేశీయులు విశాలమైన భారత దేశాన్నంతా జయించి పరిపాలిస్తున్నారు. ముప్పయి రూపాయిల గుమాస్తాపని దొరికితేనే చాలుననీ, మూడువందల రూపాయిల ఉద్యోగము చేస్తేనే జీవితము ధన్యమైపోయినట్లు తలంచేవారు మనలో వేనకు వేలున్నారు. ఇక దేశము, భాష, జీవితాదర్శముల గురించి ఆలోచించేవాళ్లే లేకుండా పోతున్నారు. ఇతరదేశాలలో మనదేశముగురించి ఎటువంటి నీచమైన ప్రచారము జరుగుతూందో మనకు తెలియనిదా? ఏఒక్క రవీంద్రుని వల్లనో, గాంధీ వల్లనో మనమూ ఉన్నామని విదేశాలలో తలయెత్తుకు తిరుగుతున్నాము.

మా రాజమహేంద్రవరములో వీరేశలింగముగారి శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి మోడరన్‌రివ్యూ సంపాదకుడు,

రామానంద చటర్జీగారు వచ్చినప్పుడు ఏమన్నాడంటే: 'మీ తెలుగు దేశములో ఇటువంటి వీరుడు, ధీరుడు, కవి, సంస్కారి ఉన్నట్లు ఎంతోమందికి మన దేశములోనే తెలియదు, ప్రక్కనున్న మాకే తెలియదు. ఇక విదేశాలసంగతి ఏమిచెప్పను! మీలో ఎంతమంది ఆంగ్లభాషలో కోవిదులు లేరూ! వారంతా ఏమిచేస్తున్నారు? ఆలోకోత్తర పురుషుడైన వీరేశలింగంపంతులు గూర్చి ఇంగ్లీషులో గ్రంథాలు వ్రాసిలోకాని కంతటికీ మీలో ఇంత గొప్పవాడున్నట్లు తెలియపరచకూడదూ!' అన్నాడు. అది ఎంత విలువమైన సలహా! అయితే, ఆచరించిన పెద్దమనిషి ఏడీ?

ఇంతకు చెప్పవచ్చిన దేమిటంటే, మనలో అనేకమంది గొప్ప వ్యక్తులున్నారు, గొప్ప గ్రంథాలున్నవి: ఇవన్నీ విదేశాలలో సయితము వెల్లడి కావలసి ఉంది. కాని మనలో మనకు అసూయ, ఈర్ష్య, కాపట్యము, కులగౌరవ ప్రతిష్ట ఎంత ఉన్నదీ! ఇవన్నీ చంపుకుని దేశము కొరకు ('దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్నాడు గురజాడమహాకవి), భాషకొరకు మనము చేయవలసిన త్యాగము ఎంతో ఉంది.

ఎవరిమట్టుకువారు తమతమ కుటుంబాలతో, ఉద్యోగ, వ్యాపారాలతో జీవితాలను సరిపెట్టుకుంటున్నారు. వారిదృష్టి,

ఆలోచన స్వవిషయం, కుటుంబక్షేమం, పిల్లల పెళ్ళిళ్లు తప్ప అంతకు మించిపోదు. ఇక దేశక్షేమము, భాషాభ్యుదయము ఎవరికి కావాలి ?

షెల్లీ అన్నట్లు : 'Poets are the unacknowledged legislators of the world.' సంఘాన్ని బాగుచేయవలసిన బాధ్యత రచయితలపైన ఉంది, అని మనవి.

రాజమహేంద్రవరము,
1వ సెప్టెంబరు 1938.

స. వెంకటరత్నం

# రయితుబిడ్డ:

అది ఆషాఢమాసము. పశ్చిమగోదావరిలోని పూళ్ల: పల్లెటూరు. మధ్యాహ్నము రెండుగంటలవేళ; ఆమె గట్టు పైనున్న గున్నమామిడి చెట్టుక్రింద పసికూనను మెత్తనిగుడ్డ లుపై పరుండపెట్టి అచట కూరుచుండి యున్నది. ఆమెప్రక్కనే పదునైదేండ్ల కుమారుడు ఆసీనుడైయున్నాడు. పది అడు గులదూరములో నొక తాటియాకుల యిల్లు, దానిప్రక్కనే గోడలేమియు లేక మొకరములపైననే యున్న పాక, సమీ పముననే కంచెవేసియున్న గడ్డివాము దొడ్డి కలవు. ఆమెకు ఎడమచేతివైపు చిన్నిచెఱువు, దాని గట్టుపైన అంటుమామిడి మొక్కలు, రెండుమూడు అరటిచెట్లు, నాలుగైదు కొబ్బరి మొక్కలు, మల్లెతీగెలు, గుబురుగానున్న వేపచెట్లు, తాటి చెట్లు కలవు.

గట్టుక్రిందనున్న పొలములో కొందరు స్త్రీలు వరుసగా నిలుచుండి మెత్తని తడినేలపై లేతవరియాకు ఊడ్చుచు న్నారు, వంచిన నడుములు ఎత్తకుండగనే. ఆమె, కుమా రుడు గొంతెత్తి సన్నని మధురస్వరమున ఇట్లు పాడుచున్నారు:

ఈగడ్డిపూవులే
ఈదారి పొంతనే
అలసి పోసివోయి

దేవా, దేవా!
నీయిష్టమైనచో
నీపూల దండలో
మెరసి పోనీవోయి
దేవా, దేవా!

(శ్రావణి)

తడినేలలో చెమటగార్చుచు పనిచేయుచున్న ఆ స్త్రీలు ఈ యిర్వురుపాడిన పదమును మరల ఆలపించుచుండిరి. వీరు పాడినపాదమునే యొకసారి, మరియొకసారి దాని తరువాతి పాదమును నవ్వుచు, నడుమ నడుమ నొకరి నొకరు వేళాకోళము చేసికొనుచు, ఉత్సాహముతో, ఉద్విగ్నహృదయములతో నా ఊడ్పుకత్తెలు పాడుచున్నారు. ఈ పాటవలన కలిగే ఆనందములో వారు పనిచేయుచున్న మాట, పనివల్ల కలిగే బాధ మరిచియే పోయినారు. నిమిషనిమిషమునకు ఇనుమడించుచున్న ఉద్వేగము, ఉత్సాహము వారికి మైమరపు కలిగించినది. 'ఆకట్ట యిల్లా యియ్యవో అమ్మా' అనీ 'ఆకు యెంత లేతగావుందే మేలిమిటీగెల్లాగు' అనీ 'ఆ యమ్మకి యేం వోపికే మనకీపాట నేర్పడానికి' 'అల్లాటి కంటం నాకే వుంటేనా' అనీ మధ్య మధ్యవారిలో గుసగుసలు మాత్రము బయలుదేరుచున్నవి.

ఇంతలో తొమ్మిదేండ్ల బాలుడు మణుగుబూరి పర పర నమలుచు పరుగునవచ్చి 'అమ్మా, మన రవుడీ యెవరో

మనిషిమీాద భోంయి భోంయి మని మొరుగుతోంది '
అన్నాడు.

ఆమె దాన్ని యిల్లా తీసుకురాకపోయావా మరెందుకూరు
కున్నావు?'

బాలుడు "ఎంత పిలిచినా రాలేదమ్మా. గబగబా
వెళ్లి గబాలున మెడపట్టుకుని బతిమాలాను కూడా రమ్మని.
'నేను రాను పో నీ కెందుకూ' అంటా వుందమ్మా! మళ్లా
యేయి రవుడీ, జాగ్రత్త, నీ పని పట్టిస్తా, పో, యింట్లోకి పో,
అంటే 'భోంయి, భోంయి' మని వచ్చి 'నీ మణుగుబూరి
తినేస్తా జాగ్రత్త' అని మీాద పడబోతే వచ్చేశనమ్మా" అని
గంతులువేయుచు, గట్టిగా నవ్వుచు మణుగుబూరి నములు
చునే పసిబిడ్డ దగ్గరకు పరుగెత్తి,

నీ పూల దండలో
మెరిసి పోనీవయ్యా
దేవా దేవా

అని సన్నగా మెల్లగా తనలో తానే పాడుకొనుచు
అచటనే కూరుచుండి పోయినాడు.

తల్లి ఆజ్ఞానువర్తియై పెద్దకుమారుడు రాడీని తీసుక
వచ్చుటకై పరుగున వెళ్లినాడు. అయ్యది భయంకరమూర్తి
అయినను చనవుతో బాలుడు దాని మెడనున్న తోలుపట్టా
పట్టుకొని, అచటనున్న వానిని వెంటబెట్టుకొని తల్లిదగ్గరకు
వచ్చినాడు.

ఆతడెవరో క్రొత్తవాడు. నవనాగరకుడు. మల్లెపూవు వంటి తెల్లనివస్త్రములు; కండ్లకు బంగారు సులోచనములు; చేత నొక చక్కని చేకర్ర.

ఆమె లేచి నిలువబడి యింకను కుర్కను పట్టుకొనియే యున్న పుత్రునిజూచి "వారిని తీసుకువెళ్లి యింటిలో కుర్చీ వేసి కూర్చోబెట్టి రా" అన్నది.

ఆ నూతనపురుషుడు మారు మాటాడకనే బాలునివెంట వెళ్లి యింట నాసీనుడైనాడు.

రవుడీని కట్టివేసి వచ్చిన పుత్రునితో "తండ్రీ, దాని తరువాతి పాదములు కూడా వాళ్లకు నేర్పుతూవుండు; నే నిప్పుడే వస్తాను" అని పసిపాపదగ్గర నున్న కుర్రవానిని తీసికొని, అదివరకే జారుముడి వేసియున్న కేశములు విడదీసి మరల ముడివేసి పయ్యెద సర్దుకొని ఆమె బయలుదేరినది.

చిన్నిబాలుడు 'అమ్మా! ఈ మణుగుబూరి యేం చెయ్యనూ!'

తల్లి 'అక్కడపెట్టి రా. మళ్లీవచ్చాక తిందువుగాని.'

ఆమె ముప్పదియేండ్ల లావణ్యవతి. చూపుకు ఇరువదియేండ్ల యౌవనవతివలె కాన్పించును. చామనఛాయ. పలుచని, బలిష్ఠమైన, నున్నపైన శరీరము. వదనమున సౌమ్యమైన తేజస్సు. వేషమున పల్లెటూరి పడుచువలె నుండినను ప్రకాశమానమైన మోము, వెన్నెలవెలుగు గల నేత్రములు, మృదుమధురమైన వాక్కు, మందగమనము—యివన్నియు నామె సామా

స్వైరమణి కాదనియు, నామెలో అపూర్వమైన, అనిర్వాచ్య మైనశక్తి, తేజస్సు యేదో కలదని అపరిచితులకు తోచును.

మెల్లగా నామె చిన్నిబాలునితో వచ్చి 'అయ్యా, దాహమేమైనా పుచ్చుకుంటారా?' అని అడిగినది.

ఆతడు అవనతవదనుడయియే ఏమో ఆలోచించుచునే 'కొంచె మిప్పించండి' అన్నాడు.

ఆమె లోనికి జని విశుభ్రమైన కంచుపాత్ర నిండా చిక్కని గేదెమజ్జిగపోసి ఆతనికి స్వయముగానే యిచ్చినది. నీ పేరేమిటి అని అదివరకే ప్రశ్నింపబడి యుంటచే నా బాలుడు 'ఊఁ—నా పేరా—మరి—బాలచంద్రుడు' అను చున్నాడు.

ఆతడు చిఱునగవుతో 'ఏ వూరి బాలచంద్రుడువయ్యా నీవు! చుక్కల్లో చంద్రుడు నీ కేమవుతాడు' అన్నాడు.

బాలుడు 'నేనా పల్నాటి బాలచంద్రుణ్ణి అండీ. చుక్కలు, చందమామ, కొంగలు, ఎద్దులు, మా రవుడీ కుక్క అన్నీ మా చుట్టాలేనండీ, మా అమ్మ చెప్పింది'

అంతలో కంచుపాత్ర తీసుకవచ్చిన తల్లి ఆ పలుకులు విని పాత్రనందించిన తర్వాత బాలునెత్తుకొని 'ఎవరు నేర్పి నారయ్యా, ఈ చిట్టిబుద్ధులు! నువ్వు పల్నాటి బాలచంద్రు డవా?' అన్నది చిఱునగవుతో.

'అవునమ్మా. నాన్నగారు నామీద పద్యాలు నేర్పారు కూడాను. ఆ పల్నాటి బాలచంద్రుడే నువ్వు. బ్రహ్మనాయడు నేను, ఐతమాంబ మీ యమ్మ అన్నారు కూడాను నాన్నగారు'

ఆమె ఆ ముద్దుపలుకులు విని వికసించిన హృదయముతో తేజోవంతములైన కళ్ళతో నవ్వుచు బాలునిశిరస్సు మూర్కొని "అయ్యా, తమరేమి పనిమీదవచ్చినారో మగవారు యింటిదగ్గర లేరు. ఇప్పుడే గంటక్రిందట ఆకుమళ్ళ చెరువు కేసి వెళ్లినారు. తమరు కూర్చుంటే ఒక అరగంట, గంటలో వారు వస్తారు. మీరు మాట్లాడి వెళ్లవచ్చు' అన్నది.

అతడు 'వారితో నా కేమియు ప్రత్యేకపు పనిలేదండి. వీలైతే దర్శనముచేసి వెళతాను. కేవలము అందుకనే కాదు నేను రావడము. రోడ్డుప్రక్కనే వొంటరిగా వున్న యిల్లు, మీ రిందాక యేదో పాడుతున్నారు, చాలా శ్రావ్యముగా వుంది, విని చూచి పోదామని వచ్చాను. ఇంతలో దాహము కూడా అయింది'

ఆమె 'మా పాటలేమున్నవి లెండి! ఏవో పల్లెటూరి పదాలు. పనివాళ్లకు నేర్పితే వాళ్లుకూడా నేర్చుకొని ఆనందించుతారు కదా అని వూసుపోక నేర్పుతున్నామే కాని—'

అతడు 'అమ్మా, అల్లా అనకండి. పల్లపూరులో మీ సంగతి అనుకుంటూవుంటే విన్నట్టు జ్ఞాపకము. మీ భర్తగారు చాలా విద్యావంతులనీ, మీరుకూడా ఇంగ్లీషుసంస్కృతము

బాగా చదువుకున్నవారనీ అక్కడివారు చెప్పుకుంటూ వుంటే విన్నా. అయినా ఆ పాట పల్లెటూరి పాట యెల్లాఅవుతుంది లెండీ, మీ వంటివారు పాడుతూవుంటే' ఆమె 'ఏమండీ అల్లా అంటారు, మేము పల్లెటూరి వాళ్లముకామా. మా తండ్రిగారు రైతు, భర్తగారు రైతు, చిన్నప్పటినుంచి పెరిగింది కేవలము పల్లెటూళ్లలో. కాస్త చదువుకున్నంత మాత్రానే బస్తీ వాళ్లమైపోతామా!'

అతడు 'దానికేమి లెండి. ఇందాక అబ్బాయి పద్యాలేవో నాన్నగారు నేర్పారన్నాడు. ఏమైనా చదవమనండి. చిన్నపిల్లలు చదువంటే నాకు అమితమైన కోరిక.'

తల్లి 'ఏది నాయనా బాలచంద్రుడు పద్యాలు చదువు మీ నాన్నగారు నేర్పినవి, వారు వింటారట' అని బాలుని క్రింద దింపినది.

బాలచంద్రుడు ఠీవిగా నిలువబడి చేతులు ముడుచుకొని :

'ఈవిశాలప్రపంచాన నింతదనుక
నెందరోపుట్టి గతియించిరేమి ఫలము!
వీరులగు వార లేనాటివారలైన
శాశ్వతులు వారె కీర్తి రాజ్యమున నెపుడు.
శత్రువుల గుండెలవియ దేశంబుకొరకు
ఘోరముగ బోరి పల్నాటి వీరుడైన
బాలచంద్రుండు తనయెలప్రాయమందె
స్వర్గమున కేగి యెన్నేండ్లొ జరిగిపోయె.

నాటి పల్నాటి వీరుడొనర్చినట్టి
వేడినెత్తుటి మడుగు లానాడె యింకె
అతనిచే కూలినట్టి యోధాళితనువు
లవనిగర్భంబుతో నాడె యైక్యమయ్యె.
పాడువడె నాటిపల్నాటి పౌరుషంబు ;
చెరగె నావీరువిక్రమ చిహ్నలెల్ల ;
గాని యీనాటికిని గూడ వానియశము
పులకరింపగజేయు నాంధ్రుల యొడళ్ళ.
వీరుడగు బాలచంద్రుని విక్రమంబు
వేడ్క నానాడు జూచి పవిత్రమైన
నాగులేరిప్పుడును పలనాటియందు
నాయమృత శౌర్యగీతము లాలపించు.
వీరుడగు బాలకుం డుద్భవించి నట్టి
వెలమకులమెల్ల విఖ్యాతివెలయు చుండె
నతని పదధూళిచే ధన్యమైన యట్టి
వీరమేడపి లోకైకవిదిత మయ్యె.
అతని తలిదండ్రులై యెంతొ యశముగనిరి
బ్రహ్మనాయుడు, నైతమాంబయు, ధరిత్రి ;
ఖిలముగా కెప్పటికిని వీరులసమాధి
శౌర్యసుమముల ధర్మవాసనలజిమ్ము.'

(గీతామంజరి)

మధురమైన కంచువంటి కంఠమున పాడినాడు.

అతడు 'షెబాష్! తెలివిగల పిల్లవాడవోయి. మీకు పేరుప్రతిష్ఠలు తెస్తాడు, అందులో సందేహము లేదు. ఏదైనా బడిలోకి పంపిస్తే క్రమమైన పద్ధతిగా విద్య నేర్చుకోవడానికి, రేపు ఏ బి. వ్యే. యం. ఏ. ప్యాసవడానికి వీలుంటుందిగా, అల్లాచేయక పోయారూ?'

ఆమె 'ఏమోలెండి. వీళ్ల నిల్లా బ్రతుకనిస్తురూ! వాళ్లతండ్రే యిదివరకు ఆయన కాలేజీలో ప్రొఫెసరుగా పని చేశే వున్నారు—యిప్పుడు మా పిల్లలకే ప్రొఫెసరైనారు. ఏదో పదిపుట్ల నేల పండించుకుంటూ యీ పొలముగట్టు మీద వున్నవాళ్లను కూడా పంచమబాలుణ్ణి పెంచామనీ, మేము పంచములమనీ వూరువారంతా బహిష్కరించారు. ఇదీ వొకందుకు మంచిదే అనుకున్నాము. ఇక ఈ పిల్లవాణ్ణి బడిలో అడుగు పెట్టనిస్తారూ, ఆ మొనగాళ్లు.'

అతడు 'ఓహో, అల్లాగటండీ! అయితే నేమీలెండి, ఏ పిల్లవాడివల్ల మీరు చిక్కులుపడతారో, ఆ పిల్లవాడిమూలం గానే మీరు శాశ్వతకీర్తి పొందుతారు. బాగా వృద్ధిలోనికి వస్తాడు తప్పకుండా'

ఆమె 'కీర్తి యెందుకులెండి. ఈ కుర్రవాడితోనే ఆ ఛాందసులకు బుద్ధి కరిపించవలె అని మా మగవారి అభిప్రాయము. అందుచేతనే ఆయన స్వయముగా ప్రత్యేకశ్రద్ధతో ఈ పిల్లవాడికి విద్య చెప్పుతూ ఉంటారు. ఇద్దరిపిల్లల సూక్ష్మ బుద్ధి, చురుకుదనము చూచి వాళ్లనాన్నగారు పట్టరాని సంతో

షముతో ఇబ్సన్ నాటకములో చెప్పినట్లు 'Then you shall drive all the wolves out of the country, my boys!' అంటూ వుంటారు. అందరము నవ్వుకుం టాము ' ఆతడు ' అంతకంటే యేమి కావాలండి మీకు! నిక్షేపమువంటి సంతానము ; కోట్లధనము కంటే విలువైన విద్యాసంపత్తి. అయితే తోడేళ్లు అంటున్నారు. ఎటువంటి తోడేళ్లో నా కర్థము కాలేదు '

ఆమె తెచ్చుకొనిన ఉద్రేకముతో " సంఘము : కొయ్య బారిన సంఘం. క్రూరమైన సంఘం. దట్టముగా ఒక ప్రక్క అడివి పెరిగిపోయి అందులో తోడేళ్లు, యెలుగుబంట్లు స్థిర నివాసము యేర్పరుచుకుంటే కళ్లుమూసుకొని కొయ్యబొమ్మల వలె వూరుకున్నారు. ఇప్పటికే అవి చాలామట్టుకు నాశనము చేసినవి. ఇల్లాగే కళ్లుమూసుకుని పశువులు లాగా వూరు కుంటే ఈ పశువుల నన్నింటినీ అవి తినివేస్తవి. ఇప్పుడా కారడవిని కొట్టివేసి ఆ క్రూరజంతువుల్ని—కొన్నిటిని నాశ నము చేసి—కొన్నిటిని సముద్రములోనికి తరిమివేసి—ఈద గలిగితే యీదుతవి లేక పోతే చస్తవి—మరలా దేశమంతా సస్యశ్యామలము చేయవలి. ' అని తన వీరావేశము గాంచి తానే నవ్వుకొనినది. బాలుడు ' అమ్మా, అడివి నేనుకూడా కొట్టివేస్తా. మొన్న నాన్నగారు బ్రహ్మజెవుడు తుప్ప కొట్టి వేస్తావుంటే నేనుకూడా కొడవలి పట్టుకొని పరపర నరికివేశా. యేం అమ్మా, నేనుకూడా నీతో రానా అడివి నరకడానికి '

తల్లి "వద్దుగానిలే నాయనా, నేను వెళ్లేటప్పుడు—(గభీరవదనమున) అయ్యా, దేశమంతా మూర్ఖులు. నూటికి తొంబదితొమ్మండుగురు పరమపశువులు. ఎవ్వడైనా ఒక్క వ్యక్తి మానవుడుంటే అతడు నిద్రబోతూ వుంటాడు. ఈతొంబది తొమ్మండుగురే సంఘాన్ని, దేశాన్ని నడుపుతున్నారు. ఆవొక్కడు తెలిశివుండికూడా 'పదుగురాడు మాట' అని చెప్పి తానుకూడా పశువులలో చేరిపోతాడు. ఇదంతా మార్పుకావడానికి కొంతకాలము పడుతుంది—అయ్యా లేకపోతే చూడండి, ఈపసిబాలుణ్ణి చేరదీశామని ఈమూర్ఖుల కింతపట్టు ఎందుకూ? అందరిలోనూ వెలిగే వెలుగు వొక్కటే అని ఆమూర్ఖులకు తెలియచెప్పితే మాత్రము తలకెక్కుతుందీ? సూర్యునికి కిరణములెల్లాగో మనముకూడా పరమేశ్వరుడికల్లాగు అని మా మగవారు అనేకవిధాల ఆమూర్ఖులకు చెప్పి చూశారు. పశువులకు మనుష్యుల మాటలేమి అర్థమవుతవి, పోనీ మీరేచెప్పండి!"

అతడు 'అవునండి. ప్రపంచము. ఎదురుచెప్పితే కష్టాలున్న మాట నిజమే. ఏమి చేస్తాము!'

ఆమె 'ఏమండీ, మీరుకూడా అల్లాగే అంటారు. చూస్తూ చూస్తూ విషము త్రాగమంటే యెల్లాగండీ! అల్లాగైతే కుక్కలకు, కాకులకు, మనుష్యులకు తేడా యేమున్నదీ! కొన్ని విషయాలలో ఈమూర్ఖులకంటే కుక్కలు, కాకులు నయమనిపిస్తవి.—అయినా యిప్పు డేమనుకుంటే ప్రయోజన

మేమున్నదిలెండి! చేసేరీతిగా చేయవలెగాని. రేపు ఈకుఱ్ఱ వాడే వాళ్లకళ్లు తెరిస్తే అప్పుడు మేలుకుంటారు'.

తల్లి ఉద్రిక్తయై మాట్లాడుటగని అంతవఱకు పరాయత్త చిత్తుడైయున్న బాలుడు ఆమె చెంగుపట్టుకొని 'అమ్మా, ఆయనతో ఎందుకే అంతకోపముగా మాటాడుతున్నావు? రవుడీని తీసుకురానా యేమిటి? అదే వెళ్లమని చెపుతుంది, మనము చెప్పడమెందుకు' అన్నాడు.

వారిద్దరు నవ్వుచు:

ఆతడు 'గడుసువాడవోయి, చంద్రా'

ఆమె నవ్వుచు: 'ఆయన వాళ్లవూరు, పెద్దపట్టణం, తీసుకు వెళ్లి పెంచుకుంటారట వెళతావా?'

బాలుడు ఊఁ, నాకేఁ వెళ్లేదాకా. ఇక్కడైతే నాన్న గారిదగ్గర చదువుకుంటా, కోతికొమ్మచ్చి ఆడుకుంటా, నాపెంపుడు పొదకోడి నేమిచేయమంటావు? మరి దానితో ఎవరు పరిగెత్తుతారు—అమ్మా, నేవెళ్లితే పాప నెవరా డిస్తారూ?'

తల్లి 'రవుడీ ఆడిస్తుందిలే. లేకపోతే చందమామకిస్తే అది ఆడిస్తుంది.'

బాలుడు 'నేనూ చంద్రుడినేగా, నాకే యివ్వరాదూ! నేను తీసుకెళ్లి చిలకలకిస్తే అవి జాంకాయలు పండువి పెడతవి. ఎంచక్కగా తిని మళ్లా నాదగ్గిర కొస్తాడు. మనతెల్లావు

పాలిచ్చి పెంచి, దానిదూడ, నేను, పాపాయి గంతులేస్తూ దాగుడుమూచి ఆడుకుంటాము '.

తల్లి 'ఆటలో తల్లి యెవరుంటారు మరి మీకు?'

బాలుడు 'మన సంగీతపుచెట్టు చిటారికొమ్మల్లో గూడు పెట్టిన కాకిపిల్లల తల్లి మాఆటలో తల్లి. అవన్నీ నీకెందు కేమిటి? నీవు మాజత లేనన్నావుగా, నన్ను ఆయనతో వెళ్లి పొమ్మన్నావుగా'.

తల్లి 'లేదయ్యా, అల్లా అనలేదు. నిన్ను నేను విడిచిపెడ తానా ఆయన యివ్వమంటే మాత్రము. మనమందరమూ రేపు ప్రొద్దున్న దాగుడుమూచి ఆడుకొందాములే'.

అతనివైపు తిరిగి 'అయ్యా, మీరు పాటవిందామని వచ్చి నట్లు కనిపిస్తుంది. అక్కడికి వెళుదాముర౦డి పల్లెటూరిపాట ఎల్లావుందో చెపుదురుగాని'.

ముగ్గురు బయిటికి వచ్చినారు.

కోకిలరాగము. పెద్దకుమారుడు కళాయుక్తముగా మధుర మందముగా, ఆగి ఆగి వీచుచున్న పెనుగాలి కెగయు జలతరం గములవలె నడుమ నడుమ కంఠము విసరుచు ఉత్సాహోద్వే గముతో, ఉన్మీల నేత్రములతో లేత అరటి మువ్వలవంటి చేతులు ఊపుచు ఈరీతి పాడుచున్నాడు :

'ఈచిన్ని సెలయేళ్ల
నీకొండ కోననే
ఎండిపోనీ వోయి

దేవా! దేవా!
నీయిష్ట మైనచో
నీప్రేమ రాశిలో
నిండిపోనీ వోయి
దేవా! దేవా!'

ఊద్పుకత్తెలు కూడా అంత ఉత్సాహోద్వేగముతోనే మధ్య మధ్య బడలికచే గొంతు నొక్కి నొక్కి ప్రతిపదము ప్రతిధ్వనించుచున్నారు.

చిన్ని బాలుడు పరుగునవెళ్లి పసిపాప ప్రక్కలో దాచి వచ్చిన మణుగుబూరి పట్టుకొని: 'అమ్మా—' అని ప్రశ్నా ప్రకాశితమైన కనులతోనే అడిగి అనుమతిపొంది పరపర నమ లుట మొదలు పెట్టినాడు.

ఆమె 'అయ్యా, యిటు దయచేయండి' అని, పసిపాప దగ్గరకాతని తీసికొని వెళ్లి అచట కూరుచుండజేసి తాను కూడా రెండుబారల దూరములో పసిపాప ప్రక్కలో గూరు చుండి: 'అయ్యా, మాకేమున్నది, రైతులకు భూదేవి తల్లి పదివేళల పచ్చగావుంటే చూడడమే పండుగ. పచ్చని పొలము బంగారురంగుగా మారిందా అంటే సంక్రాంతిపండుగ వస్తుంది; యిక అప్పుడు పాటకజనమేమిటి, పక్కారయితు బిడ్డ లేమిటి ఒళ్లుమరిచి పండుగ జరుపుకుంటారు. కొందరు కోడి పందాలు, కొందరు పొలిమేరమ్మకు వేటపోతులు, వచ్చేకూతుళ్లు, అల్లుళ్లు—యిదే రైతులకు పదివేలు. ఇక మేమో ఆసంక్రాంతి

పదిరోజులు మామగవారి పెత్తనముక్రింద ప్రార్థనలు— పొలము బాగా పండించి వర్షములు సమృద్ధిగా కురిపించి తన సంతానాన్ని ప్రేమదృష్టితో ఆశీర్వదించినందుకు ఆపరమపితకు నమస్కారము చేస్తాము. మాపనులుచూచి వాళ్లు మేము పిచ్చి వాళ్లమంటారు. వాళ్ల క్రూరమైన నీచమైన కోడిపందాలు, అమ్మవారికి కల్లు పోరబోయిడము యిటువంటివి చూచి మేము చిరాకుపడతాము. ఏమున్నదండీ మరీ ఈకాలవక్రింద వూళ్లలో తృణకాష్ఠ జలసమృద్ధిగా వుండడము, ఈపశువులను సరియైన త్రోవలో నడిపే పశుకాపరి లేక పోవడమువల్ల కన్ను మిన్ను గానకుండా వున్నారు. ఏమైనా, ఎంతచెడినా బస్తీవాళ్ల కంటే చాలా మడుగులు వీళ్లు నయమేలెండి. ఇప్పుడు కాక పోతే వొకప్పటికైనా మోక్షమున్నదని ఆశ వొకటైనా వుంది.'

ఆతడేమియో ఆలోచించుచు వినుచున్నవానివలె నంత దనుక కూరుచుండి 'అయితే యేమమ్మా, కడమా పొలాలేవీ అంత పచ్చగా వున్నట్లు కనిపించవు; ఈ చుట్టుప్రక్కల అప్పుడే వూడ్చి వేసినట్లు కనిపిస్తుంది యేమి కారణము!' అన్నాడు.

ఆమె 'చెప్పడము లేదండి. పొలము చక్కగా దుక్కి దున్ని జాగ్రత్తగా వొళ్లువంచి దమ్ముచేసి ముదురుగా వూడిస్తే భూమా పాడుకాదు, పంటా బాగా పండుతుంది. ఈ చుట్టూ పచ్చగా కనిపించే దంతా మనదే. దీన్ని దేవుడు చెర్వుపాల

మంటాము ; ఇది అరవయి యెకరాల ఖండ్రిక. అందరికన్నా ముందుగా ముదురుగా వూడ్చవలి అని మా మగవారి పట్టు. ఈ యేడు అల్లాగే చేశాము. నిరుడు ఈ కనిపించే ఆరుమడులూ చెరుకువేయడము వల్ల కొంచెము చెల్లాచెదురైనవి. ముందు యీ మడులు బాగుచేసి మరీ తర్వాత తక్కినమడులు దమ్ముచేశాము. అదృష్టవశాత్తు నిరుడు చెరుకుపంట సమృద్ధిగా పండింది: పదిరాళ్లు చేతులో మోగినయి. ఆపై సంవత్సరము—ఆ యీశాన్యపుమూలముగా యీతచెట్టువున్నగట్టు చూశారూ, అక్కడ సామర్లకోట ఫారమునుంచి తెప్పించి క్రొత్తరకము అరటిచెట్లు వేశాము. ఓపికతో, చెమటవోడ్చి యిద్దరమూ కూడా అందులో పనిచేశాము. కన్ను చెదిరేటట్టుగా కంపెనీ చక్రకేళీగెలలు కాచినవి. ఇల్లాగే శ్రద్ధగా పనిచేసుకుంటే ఫలము దక్కుతుంది. మావూరివాళ్లకు భూదేవిమాటే మరుపుకువచ్చి మత్తెక్కి రెండురాళ్లు చేతులో వేసుకొని బస్తీమీద పడి నానా పాడు అవుతున్నారని చెప్ప లేదటండీ. పొలమంటే, హాయిగా మెల్లగా పనిచేసుకుంటే యెంతో దయతో అది ఫలితము చేతికందిస్తుంది. ఈ కాస్త పనికూడా మా రైతుపోకిల్లాలకు భారమైపోతూంది. కోత లైన తర్వాత దంటుతడుపు పెట్టే పొలాలకు దంటుతడుపు పెట్టవలి, మెరకవేసిన ఒడ్డుమళ్లు మరమ్మతు చేయవలి, గొర్రెల పెంట కట్టే దానికదీ, పాటిమట్టి పోయవలసిన దానికదీ, మెరకపల్లాలు బాగుచేసుకోవడము, ఆకుమళ్ల చెరువు మెరక

వేస్తే మళ్ళీ త్రవ్వించడము, చిదికిపోయిన గట్లు మరలా పోసుకోవడము—ఒకటేమిటండీ వేయిన్నూరు పనులున్నవి భూదేవికిచేస్తే. గట్లపైన జనువు, కంది, వేస్తే పండుతుంది. పొలము గొడ్లుతొక్కి పాడుచేయకుండా కనిపెట్టి జాగ్రత్తచేసుకుంటే భూమి పాడవ్వదు. ఇవన్నీ చిన్నవిషయాలే. అందుచేతనే మరీ యెక్కువశ్రద్ధతో గమనించవలె. మామగవారు జాగ్రత్తగా యివన్నీ చూసుకుంటారు, నాకూ పిల్లలకూ చదువు చెపుతారు, కోఆపరేటివు యూనియనుపని చూసుకుంటారు. ఇప్పుడు బిల్డింగు సొసయిటీ వొకటి పెట్టవలె అని ఈనడుమనే ఇంగ్లండుకు వ్రాసి నేషనల్ బిల్డింగు సొసయిటీవారి దగ్గర్నుంచి యావత్తు భోగట్టా తెప్పించారు. ఏదో యీవిధముగా క్రిందపడుతూ, మీదపడుతూ కాలము వెళ్లబుచ్చుతున్నాము.'

అతడు 'అబ్బా, యెన్నివిషయాలు క్రొత్తవి, తెలిసినవండీ యీరోజున. మీవంటి స్త్రీలు పదిమందివుంటే దేశము బాగుపడ దటండీ.'

ఆమె 'నాశక్తి యేమున్నదండీ. ఆయన అన్నీ శ్రద్ధతో నాకుబోధచేస్తూ వుంటారు. అవన్నీ మనసుకు పట్టించుకుంటాను. చేయగలిగినంతా పాటుపడుతూ ఉంటాను.'

అతడు 'అయితే యేమమ్మా, ఎంతతృప్తి, ఎంత ఆనందము ఈ పనుల్లో ఉన్నప్పటికీ యీనడిదీవిలో మానవ పురుగు సంబంధము లేకుండావుంటే లోకముతో సంబంధము తెగిపోయినట్లూ, వొంటరితనముగాను బెంగగాను ఉండదూ!

మీారేమో మీాపొలాలేమో, అయితే ప్రపంచమెల్లా నడుస్తూందో ఏమేమి రోజు రోజుకి క్రొత్తవిశేషాలు జరుగుతూన్నవో తెలియకపోతే నడిసముద్రముమధ్య దీవిలో వున్నట్టు కష్టముగానూ, లోటుగానూ అనిపించదూ?'

'ప్రపంచపుసంగతులు తెలీక యేమండీ! ఆంధ్ర, కృష్ణా, ధర్మసాధనీ పత్రికలు, ఇంగ్లీషులో బొంబాయి టైమ్సు పత్రిక, హిందూపత్రిక, మోడరన్ రివ్యూవస్తవి. ఇవి నన్ను, పిల్లలను, పనివాళ్లను యెదట కూర్చోబెట్టుకొని ఆయిన చదివి వినిపిస్తూవుంటారు. ఇంకా విదేశాలనుంచి కూడా పత్రికలు వస్తవిలెండి.'

అతడు 'ఓ, అల్లాగటండీ. అయితే కేవలము స్వర్గలోకమండీ మీాది. ఏమేమి పత్రికలు వస్తవండీ, విదేశాలనుంచి.'

ఆమె 'అమెరికానుంచి లిటరరీడైజస్టు, ఫిజికల్ కల్చరు, ఎగ్రికల్చరిస్టు, ట్రుస్టోరీ, ఇంగ్లాండు దేశమునుంచి మాంచెస్టరు గార్డియను, అవుట్ లైను, టిట్ బిట్సు, టవున్ అండు కంట్రీ హోమ్సు, ఆర్గొసి పత్రికలు ఆదివారమునాడు ఫారిన్ మెయిలు రోజున వస్తూవుంటవి. ఏవో యివీ అవీ చదువుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ మధ్యమధ్య పొలముపని చూసుకుంటూ—పిల్లలను సగబెట్టుకుంటూ గడుపుతున్నాము—అన్నట్టు మరిచిపోయినాను పూలతోట చూపిస్తాను రండి' అన్నది.

ఆమెవెంట నాతడు, బాలచంద్రుడు బయలుదేరినారు. రెండు అడుగులు వేసినతర్వాత బాలచంద్రుడు పట్టుకొనిన

తల్లి చిటికెనవ్రేలు వదిలి రెండు గంతులువేసి ప్రత్యేక మేర్ప రుపబడిన గూటిలోనున్న పొదకోడిని పట్టుకొనివచ్చి తల్లి కెదురుగా వెళ్లి ఆమె నాపుజేసి కోడిరెక్క విడదీసి పట్టుకొని 'అమ్మా, నాకుకూడా యిటువంటి రెక్కలేవుంటేనా చెట్లు ఎక్కకుండానే, నేరేడిపళ్లూ, తాటిపళ్లూ, కొబ్బరిబొండాలూ కోసుకొచ్చి ఒక్కగంతులో నీకివ్వకపోయాను—అమ్మా, యింకా యేమిచేస్తానో తెలుసా ఎప్పుడు బెంగపుటితే అప్పుడే నాన్నగారిదగ్గిరికెళ్లి ఆకుమళ్లచెరువులో వాల్తాను' ఆమె చెరగుపట్టుకొని లాగుచు ఆమె కనులవంక చూచుచునే అన్నాడు.

ఆతడు 'పోనీ నీపొదకోడి నెక్కి ఎగిరి రారాదూ మావూ రికి త్రోవ చెపుతాను.'

బాల 'అల్లా యెక్కి యెగరడమే చేతవస్తేనా మీావూరు వచ్చేదాకా నాకేమిపని; యీాపాటికా లాహోరువెళ్లి లజ పతిరాయిని యెదురొమ్ముమీాద కొట్టి చంపినవాణ్ణి—'

తల్లి 'బాలా—'

బాల 'లేదండి, పోనీలెండి, ఆరోజున లజపతిరాయి చచ్చి పోయాడని తెలియంగానే మాయమ్మ, మానాన్నగారు ఏడ్చారండీ. నేనుకూడా యేడ్చానండీ! పాపం—'

తల్లి నవ్వుచు సంభాషణ మార్చే యుద్దేశముతో పొద కోడినెక్కి చందమామదగ్గిరికి వెళ్లరాదూ, నీకు పెద్దన్నయ్య అవుతాడుగా అతను' అన్నది.

బాల 'అవునమ్మా, నిన్న చందమామ మేఘాలతో పరిగెత్తలేక వెనక పడిపోతే మనమంతా చూచి నవ్వలేదూ! ఏమి పిచ్చి అన్నయ్యా యింతేనా నీపస అని చెప్పి వద్దామనుకున్నా కూడాను—అమ్మా, అటుచూడు కొండ మీద నల్లమబ్బులు ఎల్లాపరుగెత్తుతున్నయ్యో! వాటితోటి సమానంగా భూమిమీద నేనూ పరిగెత్తగలను.'

నూతనుడు, ఆమె కూడ ఒకేసారి ఆకసమువంక జూచి:

ఆమె 'ఎంతలో మబ్బులు క్రమ్మేసినయి'

ఆతడు 'అవునండీ, ఈమాటలసందడిలో మనము చూడనే లేదు' అన్నాడు.

బాలచంద్రుడు గంతులువేయుచు అమ్మా 'చినుకులు పడుతున్నయ్యో' అని

'వానాలు కురవాలి
వరిచేలు పండాలి
మాగరిసె నిండాలి
బుడుగో! బుడుగో!
మాదాసి దంపాలి
మాయమ్మ వండాలి
మాబొజ్జ నిండాలి
బుడుగో! బుడుగో!'

అనుచు పరుగెత్తి పోయినాడు.

చటాలున వెనుకకు తిరిగివచ్చి బాలచంద్రుడు 'అమ్మా! వాన కురిస్తే నేలంతా తడుస్తూవుంది; కొండ తడవదేమే' అన్నాడు.

తల్లి 'కొండ తడవదు నాయనా! అక్కడ సూర్యుడుండి తడవకుండా కాపాడుతాడు.'

౨

మొకరములమీదనే ఆధారపడియున్న పాకలో నొక యెత్తు పీటపై నా నూతనపురుషుడును, కొబ్బరియాకు చాపపై నామెయు, నామె యొడిలో బాలచంద్రుడును గూరుచుండి యున్నారు. రెప్పపాటులోనే యావరించిన కారుమబ్బులు ఏనుగు తొండములవంటి నీటిధారలను జోరుమని గ్రుమ్మరించుచుండుటచే మడిలో పనిచేయుచున్న ఊడ్పుకత్తెలు ఎక్కడి ఆకు అక్కడనే పారవైచి పెద్దకుమారుని మాట చొప్పున గలగలమని వచ్చి ఒక్కగంతులో యింటివసారాలో వచ్చి పడినారు. పసిపాపను గైకొని యాబాలకుడు తల్లి యున్న పాకలోనికి జనినాడు. వెంటనే తల్లి రెండువ్రేళ్లతో తన క్రిందిపెదవి నొక్కినది పుత్రుని రాకగాంచి. అదెందులకో బాలుడు గ్రహించినాడు. చంటిపిల్ల నొకచో ఈతయాకుల చాపపై గుడ్డలు పరచి పరుండబెట్టి వెళ్లి తల్లిప్రక్కనే ఆసీనుడైనాడాతడు.

బాలచంద్రుడు తల్లి యొడిలోనుండి లేచి వెళ్లి చంటిపిల్ల వద్ద కూరుచున్నాడు. వాన అటులనే జోరుమని కురియు చున్నది. నడుమనడుమ మెల్లగా ఉఱుములు, తళుకు తళుకు మని మెఱుపులు.

తల్లి 'మా పిల్లలకు వాన అంటే చాలా యిష్టమండీ. క్రొత్తవారు మీరున్నారని ఆగినారు గాని లేకపోతే ఈ సరికి బట్టలన్నియు తడుపుకొనేవుంటారు. నామట్టుకు నాకు కూడా వాన కురుస్తూవుంటే యెక్కడలేని సంతోషము, ఉత్సాహము కలుగుతుంది. జోరుమని వాన కురుస్తూఉంటే ఏమో పరమేశ్వరుడే తన కరుణావృష్టి కురిపించుతూ ఉన్నాడా అని పించుతుందండీ, అదేమో కాని.'

అతడు 'అవునమ్మా, వానలు లేకపోయినా, సూర్యుడు లేకపోయినా మనుష్యులగతి యేమయిపోవలశిందీ! పంటలు బాగా పండుతయి, పదిమంది కడుపునిండా భోంచేస్తారు.' పెద్దవాడు 'ఈ మధ్య అమెరికావారు వాన కురిపించే యంత్ర ము కనిపెట్టినారండీ మీకు తెలుసునో లేదో? యంత్రము పైకివెళ్లి అక్కడి గాలిలోవున్న సూక్ష్మమైన నీటిబిందువుల నన్నిటినీ చేరతీసి వర్షముకురిపిస్తుంది.'

బాలచంద్రుడు 'దాని జోలి నా కెందు కన్నయ్యా! చల్లగా వానకురుస్తూఉంటే మన ముతకబట్టల్లో యెంతవె చ్చగా ఉంటుందో చూడు, కుంపటిదగ్గిర, చలిమంటదగ్గిర కూడా అంత హాయిగా ఉండదు.'

నూతనుడు 'అయితే యిందాకనే మిమ్మల్ని అడుగు దామనుకొని మీా రేమనుకుంటారో అని అడగలేదు ; యింత నాజూకుదనము, చదువు వున్నటువంటివారు మీారుకూడా యిటువంటి మోటుగుడ్డలు వేసుకోవడము చూస్తే నాకు నవ్వు వస్తుందమ్మా, మీారేమన్నానసరే. అల్లాగైతే మీారు స్వదేశీవారా యేమిటి ? ' అని పరిహాసాత్మకమైన చిఱునవ్వు నవ్వినాడు.

ఆమె 'మేమే యేమిటి, మీారుమాత్రము స్వదేశీవారు కారా ! మనము విదేశీవాళ్లమెల్లా అవుతాము యీా గడ్డ మీాదపుట్టి యీా గాలిలో పెరిగినవాళ్లము. '

అతడు 'అదికాదండీ నేనన్నది. అయితే మీారు గాంధిగారి శిష్యులా యేమిటి అన్నమాట. '

ఆమె (నవ్వుచు) 'ఓహో, అదా మీా అర్థము. అల్లాగైతే ఒక విషయములో మేము గాంధిగారి శిష్యులమే, గుడ్డలు వేసుకోవడములో, మీా వంటివారిని కూడా యీా మోటుకద్దరు బట్టలు వేసుకోమని బతిమాలుతాము. ఈ ముతకబట్టలు మనము వేసుకోవడమంటే పదిమంది కూడులేని వాళ్లకు అన్నము పెడుతున్నామన్నమాట. మనదేశ మెంత బీదదేశమో మీాకు మాత్రము తెలియదా యేమిటి ? మా వంటి ఆడవాళ్లు చెప్పవలెనా. '

అతడు 'అదియేమో కాని గాంధి మాటాడితే 'రాట్నం, రాట్నం ' అని కలవరించడము చూస్తే నాకు నవ్వువస్తుంది. '

ఆమె 'అవును మీ వంటివారికి నవ్వు రావడములో ఆశ్చర్యములేదు, విదేశీయులు కూడా ఆతని మహాత్మ్యము తెలుసుకొని పూజాదృష్టితో చూచుతూ ఉన్నప్పుడుకూడా. గాండ్రు, గాండ్రుమని మీదపడే సింహాన్ని ఒక్కపోటుతో చంపే బలాఢ్యుడు కూడా పుండుపై వ్రాలి బాధకలిగించే ఈగలను పట్టుకోలేక పోతాడని మీకు తెలియని సంగతా ? బలవంతమైన సర్పము చలిచీమలచేత జిక్కి చావదెసుమతీ' అని చిన్నప్పుడు చదువుకున్న సంగతి మరచిపోయారా ?'

అతడు 'ఎంత ఆలోచించినా నాకీ కద్దరు ధరించడమెందుకో అర్థము కాదమ్మా ! మొన మొన్నటివరకూ జర్మను మహాయుద్ధముతో దేశమంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది. మళ్లీ యీ నాన్‌కో ఆపరేషన్ బయలుదేరి దేశాన్నంతా శ్మశానము చేసివేస్తూంది. ఉద్యోగము చేసుకొని పదిడబ్బులు గడించి కుటుంబాలను పోషించేవాళ్లంతా ఉద్యోగాలు మానివేశారు, చదువుకునే పిల్లలు బళ్లు యెగకొట్టివేశారు. ఉన్న విలువగల బట్టలన్నీ తగలబెట్టుకొన్నారు. గాంధిగారి ఆజ్ఞ అయితే యిళ్లుకూడా తగలబెట్టుకొని అడివిలో జంతువులతో వుండమంటే వుండేటట్లు కనిపిస్తుంది వీళ్ళంతా. చివరకేమయింది : ఉభయభ్రష్టుత్వము ఉపరిసన్యాసమూ చిల్లిగవ్వకైనా పనికిరాకుండా పోయారు వీళ్లంతా. ఎవరో గడుసువాళ్లు మాత్రము కాంగ్రెసు వసూలుచేసిన కోటిరూపాయలు వాడిలో పోసుకొని దారితీశారు. కడమావాళ్లు తెల్ల మొగాలు

వేశారు. ఒక కథ ఉన్నదిలెండి: బాగా బలిసివున్న వొక నక్క కటకటాలు వున్నదొడ్డిలోని ద్రాక్షపళ్లు తినడానికి ప్రయత్నించిందట. లోపలికి ఎల్లా వెళుతుంది, కటకటాలలో నుంచి దూరలేదు బలిసివున్న శరీరంతో. అందుకని మూడు రోజులు ఉపవాసంచేసి బక్కచిక్కి కటకటాలలో నుంచి దూరి తృప్తిదీరా రోజుఅంతా ద్రాక్షపళ్లుతింది. మళ్ళా బలిసింది. బయిటికి వద్దామంటే పట్టదు. మళ్ళా ఉపవాసముచేశి బక్కచిక్కి బయటపడింది. ఏమిప్రయోజనము? అల్లావుంది తుదకు ఎందుకూ చెల్లకుండా పోయారు. హాయిగా శాంతియుతముగా దేశముంటే ఈ నాన్‌కోపరేషనేమిటి, బట్టలు తగలబెట్టుకోవడమెందుకు? కడుపులో చల్లకదలకుండా పడివుండలేక యీ గోలఅంతా యెందుకో వీళ్లకి?'

పెద్దకుమారుడు 'నక్కకథకు నాన్‌కోపరేషనుకు సంబంధమేమిటో నా కర్థము కాలేదు. 'కడుపులో చల్లకదలకుండా' వుండడమంటే: గాడిదలు, కుక్కలుచేశే పనిఅదే. వాటికి కావలసిన దేమిటో తిని యిటుఅటు దొర్లి 'ప్రపంచముతో నా కేమిపని' అన్నట్టు 'పుట్టింది, చచ్చింది' అంటారే అల్లాగు చస్తవి. మనమో మనుష్యులము. జంతువులవలె ఎల్లా వుండగలమూ? అయితే యిక వాటికీ మనకూ భేదమేమిటి? జీవతోన్నతి—రోజురోజుకి ఔన్నత్యము కోసము మానవులకు పిపాస స్వభావసిద్ధముగానే వుంది. ఆ పిపాస తీర్చుకోవడానికి, జీవతోన్నతి పొందటానికి ఎటువంటి కష్టములైనా

పొందవలె. బాళ్లవలె అప్పులవలె మనమూరుకుండలేము. మనము సజీవులము. మన రక్తనాళాలలో వేడినెత్తురు ప్రవహిస్తూ ఉన్నంతకాలము, మనలో దివ్యతేజస్సు వెలుగుతూ ఉన్నంతకాలము, జంతువులవలె, బాళ్లవలె ఊరుకుండలేము. పైమెట్టు ఎక్కడానికి, చేతినుండి జారిపోయిన, లాగుకొనిపోబడిన స్వేచ్ఛామృతముకోసం—ఆజ్యోతికోసం పోరాటము జరుగుతుంది. జరగవలసిన అవసరము ముమ్మాటికి గలదు. ఏమో ఎవరో పరిపాలిస్తున్నారు, కాస్తతిండి పడవేస్తున్నారు పడివుండరాదా అనవలసింది మీవంటివారు కాదు. వాళ్లు వేరే వున్నారు. జర్మను యుద్ధమైంది. మళ్ళా ఈ పోరాటము అలజడి యెందుకు పిచ్చివాళ్లు కాకపోతే అంటారా? మనుష్యులు, మనుష్యులు కత్తులు, తుపాకులు పట్టుకొని యుద్ధము చేయడము లేనంతమాత్రానే శాంతికలుగుతుందీ. శాంతి అంటే అదికాదు. యుద్ధము అయిపోయినంత మాత్రాన శాంతి దేశానికి లభించలేదు. అది ఆత్మలోనుంచి—సంస్కారమువల్ల ప్రసాదింపబడుతుంది. బహిఃప్రపంచము కొంతవరకూ దానికి సాయపడుతుంది. నిర[illegible]కమైన, నిస్తులమైన శాంతి దేశానికి ప్రసాదించడానికే ఆ మహాత్ముడీ యుద్ధమాన్ని బయలుదేరదీసింది. ఇది ఒకానొక మహోత్కృష్టమైన సాధన ఆత్మోన్నతికోసము, జీవితోన్నతికొరకు. Spinoza చెప్పాడు 'For peace is not the absence of war' అమ్మా నిన్న నాన్నగారు చెప్పారు దాని తరువాతి వాక్యమేమిటి?'

తల్లి 'It is the virtue that is born of the vigour of the soul' అని Tractitus Politicus లో వుంది. బాలుడు 'అవును, అవును, వినండి మల్లావాసారి, It is the virtue that is born of the vigour of the soul, అన్నాడు Spinoza అనే ఒకగొప్ప డచ్చివేదాంతి. అంటే ప్రతిఆత్మ ఔన్నతి సందవలె. అప్పుడు శాంతి ప్రశాంతి. అంతవరకు కష్టము, సుఖము, ఆనందము, దుఃఖమూ ఏవీలేవు. అటువంటి virtue, ఆత్మోన్నతి కోసమే ఆమహాత్ముడీ యుద్యమానికి ప్రాణముపోసింది. పరదేశీయుల పరిపాలనలో నిర్వీర్యులమై, నిస్తేజులమై, నిష్ఫలులమై ధర్మజ్ఞానములేక పరమేశ్వర ప్రసాదితమైన స్వాతంత్ర్యము గోల్పోయియున్న జాతికి ఆత్మోన్నతి యెక్కడిదీ. లేకపోతే? ఇవన్నీ—యింకా మనఊహకు కూడా అందని వెన్నో లోతుగా ఆలోచించియే ఆమహాత్ముడు ఈయుద్యమము బయలుదేర దీశాడు. మనము విజయము పొందినప్పుడే ఆనాడు నిష్కారణముగ, నిర్వీర్యులై, నీరవులై, క్రూరముగా, నీచముగా జలియనువాలాబాగులో ప్రాణములు గోల్పోయిన ఆపరమ భాగవతుల ఆత్మలు శాంతి నందుతయి. ఆనాడే ఆదేశీయ సోదరుల పవిత్రాత్మలు ఆనంద ధామము చేరుతయి. అంతవరకు మనకూ వారికీ కూడా ముక్తిలేదు.'

అంతటి చల్లని వాతావరణమున గూడా ఉద్రేకముచే చెమటలు గార్చుచున్న పుత్రునిగని ఆమె చిరునగవుతో,

ఆమె 'అయ్యా, యిదంతా పాతపురాణం. మూర్ఖులు లేనిదేశమే లేదు. ఫ్రెంచి రివల్యూషన్‌లో ద్రోహులు లేరా, అమెరికా స్వాతంత్ర్యసంగ్రామములో కుచ్చితులు లేకపోయినారా? రషియా స్వేచ్ఛాసమరములో కల్మషుల గతియేమయినదీ? కాకపోతే వీళ్లందరినీ నడపటానికి శక్తిమంతులైన నాయకులు కావాలి. నాయకులు తాము చెప్పినమాట దాటకుండా వీళ్లనందరినీ తయారుచేసుకోవాలి. చీమలు చూడండి. వేనకువేలు, లక్షలువుంటవి. అవన్నీ నాయకుడు చెప్పినట్లే బారులుతీర్చి వెంట బయలుదేరుతవి. అంతటి సుజ్ఞానము కూడా మానవులలో మాయమయిపోయింది. అది నేడు సమర్థులైన నాయకులవల్ల పొందవలె. ఇక అనేకభాషలు, అనేక కులాలు ఉన్నవంటారా? నిజమే. ఏడువేలమైళ్ల దూరము నుండి వ్యాపారము నిమిత్తమువచ్చి అదివరకేవున్న డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచివాళ్లను, పీఠంవేసి యేకఛత్రంగా నిరంకుశంగా పరిపాలిస్తూవున్న మహమ్మదీయులను మసిబూసి మారేడుగాయచేసి వేయలేదూ కుంపినీవారు? వారికి మనదేశభాషలైనా రావే! మనదేశములో వున్న ఆచారాలు, కులాలు వివిధజాతుల భావప్రవృత్తి (psychology) అయినా బాగా యెరగరే. వారు అటువంటి పరిస్థితులలో మనభాష తెలియదు! మనకు బాటలైనా సరిగాలేవు, ఆరోజుల్లో, వారు రక్తమైనా ఎక్కువగా దేశానికి బలియిచ్చుకోకుండా దేశాన్నంతా జయించలేదూ! మనమో ఈ దేశములోపుట్టి, ఈ దేశములో

పెరిగి—మన భావప్రవృత్తి యెట్టిదో మనమెరుగుదుము—బాటలు, క్రొత్త క్రొత్తపనికరాలుకూడా లభించివున్నాయి. ఇప్పట్లో ఇట్టిపరిస్థితిలోనే మనదేశాన్ని మనము పొందలేక పోతే యింకెప్పుడో ఎక్కడో ఎల్లాగో చేయగలుగుతామనేది కలలోవార్త. ఒకప్రక్క గాంధి, మరొకప్రక్క అరవింద ఘోషు యిద్దరు మహావీరశిఖామణులున్నారు—వీరి నాయకత్వములో మనవారు ఒక్కహృదయంగా అయిపోయి ఒక్కతాడుమీద నడిస్తే యేమి సాధించలేము ?'

అత్తు 'అయితే కావచ్చు, ప్రస్తుతము నే నేమీ చెప్పజాలను. కాని—నిన్నగాక మొన్న కలకత్తా, ఢిల్లీ, లాహోరులలో మహమ్మదీయులు, హిందువులు కొట్టుకొని చచ్చినారు దానికేమి చెపుతారు' పెద్దకుమారుడు 'అమ్మా, ఈ సారి జవాబు నన్ను చెప్పనియ్యవే !—అయ్యా, యిటు చూడండి మహమ్మదీయుల మధ్య హిందువులమధ్య కొట్లాటలు ఉండవలసినదే. బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు నడుమ సాంఘికసమరము కూడా ముఖ్యముగా వుండవలె. పంచములలోను, క్రైస్తవులలోను కలవరము కూడా ముఖ్యముగా వుండవలెనని చెపుతాను. ఇవన్నీ యేమని చెపుతున్నవో చిత్తగించారా ! దేశములో స్వాతంత్ర్యేచ్ఛ, స్వేచ్ఛాసమరోత్సాహము వ్యాపించినదని. ఇంతవరకూ అడగిమడగి, అధఃపాతాళమున కణగిపోయి మట్టితిన్న పాములవలె పడియున్న దేశీయులలో ఒకజాతికి, యింకొకజాతికి యీ సమర

ములు బయలుదేరినవంటే సంచలనము కలిగినదన్నమాట. ఒకరికంటె ఒకరు జీవితోన్నతి బడయవలెనని కోరిక, పట్టుదల కలిగిన వన్నమాట. ఇంతవఱకు 'సంధ్యావందనము నిరభ్యంతరముగా జరిగితేనే చాలు' నని కొందరు 'పొలం బాగా పండితే పదిపుట్లు ధాన్యం ఒడిలో పడతవని' కొందరు 'బ్రతికుంటే బలుసాకులైనా యేరుకు తినవచ్చు' నని మరికొందరు 'యేమిశాశ్వతం, బ్రతికే రెండురోజులు కడుపులో చల్ల కదలకుండా' అని యిందాక మీారన్నారే, అల్లాగు కొందరు వైరాగ్యముతో సమస్తమున్యసించిన సన్న్యాసులవలె ఆకాశమువంక చూస్తూ మీానమేషాలు లెక్కపెట్టుకొనుచూ రాజ్యము పరులచేతులలో బుద్ధిపూర్వకముగానే మనము పెట్టివేశాము. 'వైరాగ్యము : ఏదియెల్లాపోతే మనకెందు' కనే మనకొంప తీశారు ఆ నాడు దేశీయులు. ఇప్పుడో ఆ వైరాగ్యపు వెర్రివదిలింది. వైరులపై వైరుధ్యము మనస్ఫూర్తిగా కలిగింది. వేడిరక్తము ఉబికింది. నాళాలు బిగిసి శక్తిమంతమైనవి. చిన్నప్పుడు నేర్చుకున్న 'నరుడు పౌరుషజీవితోన్నతికెగాని పుడమి పుట్టుట చచ్చిపోవుటకు గాదు' అనే వాక్యము సాధనలో పెట్టవలెననే సంకల్పముదయించింది. స్వాతంత్ర్యపు వాసనలు దేశమంతా వ్యాపించిపోయినవి. క్రొత్తనడక, క్రొత్తదృష్టి, క్రొత్తవిజ్ఞానము, సరిక్రొత్త దేశభక్తి దేశీయ ప్రజలను వశపరచుకొన్నవి. అందుచేతనే ఈ కొట్లాటలు, పోట్లాటలు, ఒకరికంటె ఒకరుపైకి రావలెనని, ఒకరికంటె

ఒకరు తమశక్తి చూపవలెనని, ఒకరికంటె ఒకరు తమదేశభక్తి యెక్కువగా ప్రకటించవలెనని—పిపాసాగ్ని రేకెత్తి యిదివరకు వున్నమందమతితనము, నిద్రమత్తు, వైరాగ్యము దగ్ధముచేసి దేశీయప్రజలలో వొక నూతనతేజస్సు కలిగించింది. ఆ స్వాతంత్రేచ్ఛయొక్క, ఆ పౌరుషజీవితోన్నతికై పిపాసయొక్క రేఖలే, ప్రతిబింబాలే ఈ దేశములోని కల్లోలము, అలజడీన్నీ. ఈ కల్లోలము, ఈ సమరోత్సాహము రాబోయే గొప్పయుద్ధానికి—యుద్ధమంటే తుపాకులు, తుపాకులు పుచ్చుకొని యుద్ధము చేయడముకాదు——అది ఆధ్యాత్మిక సంగ్రామము. దానికి యివన్నీ ప్రథమసోపానములు. ఇప్పుడిది సాధనాసమయము. దేశీయులు శిక్షపొందుచున్నారు వీటి మూలంగా ఫలసిద్ధి అందుకోవడానికి, తుదకు సమస్తము కూడా త్యాగముచేసి.

'అయితే కేవలము ఈ పోట్లాటలు ఉత్తమమైనవే అని నేను చెప్పడములేదు. వాటిలో మంచి ఉన్నదీ, చెడ్డకూడా ఉన్నదంటాను. ఆకొద్ది దోషములు పోగొట్టుటకైయే సత్యాగ్రహము, బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, రామకృష్ణ వివేకానందమఠము, విశ్వభారతి పని చేస్తున్నవి. వీటి మూలంగా దేశీయులలో శాంతిప్రయత్నము జరుగుతూ ఉన్నమాట నిజమే. అది తెలిసివుండియే నేను రెంటిని చూచి హర్షించుతాను. అసలే సంచలనము లేకపోతే, యేదో వొక రీతిగా, దేశీయులు కొన్నాళ్లకు రాళ్లవిగ్రహాలైపోతారు. సర్వము మంచికొరకే అనే పద్ధతిలోవాణ్ణి నేను. నాకు కావల

3

సింది దేశములో ఉజ్జీవము, ఉత్తేజము, స్వాతంత్ర్యపిపాస. ప్రస్తుతము మనకివిజయమువల్ల, అపజయమువలన కూడా లభిస్తున్నవి. మొన్న బార్డోలీరైతుల సత్యాగ్రహ యుద్ధము లోని విజయము, అతని పాదధూళినైనా తాకుట కర్హతలేని యొకానొక అల్పుడు లజపతిరాయిని చంపాడూ అంటే తన్మూలమున కలిగిన అపజయము—రెండును దేశీయుల రక్తనాళములలో నూతనోత్సాహము, నూతనోత్తేజము, స్వేచ్ఛాపిపాస ప్రజ్వలింపజేసినవి. ఒకానొక నూతనబలము, వాళ్లు మరిపించే శౌర్యము, వాడలు వుబికించే పట్టుదల ఆవేశించినవి ప్రజలలో. ఇక మనకు భయములేదు. ఇక మన హృదయాలలో నిరాశకు, నిర్వీర్యానికి చోటులేదు. ఆ దుర దృష్టపురోజులు గతించి పోయినవి. ఇప్పుడు గాలిలోకూడా ఆధ్యాత్మికసమరోత్సాహము ప్రసరించి పోయింది. నక్షత్రాల వరకు వ్యాపించి పోయింది. మనలను పరమేశ్వరుడు ప్రేమ దృష్టులతో ఆశీర్వదించుచున్నాడు ; అందులో అబద్ధము లేదు.'

తల్లి 'బాగా చెప్పినావోయి, తండ్రీ. కాని మగవాడ వైనందుకు నీగుణము పోయిందికాదు. మాస్త్రీల తోడ్పాటు సంగతి చెప్పినావే కాదేమి! సరోజినీదేవివంటి నాయికురాలు మనకున్నదంటే, వసంతాదేవివంటి సదమల మాతృదేశా రాధకురాలు మనభాగ్యమైతే, అన్నపూర్ణాదేవివంటి మహా త్యాగశీల, వీరవనిత మనలోనిదైతే మనకేమి కొరతవున్నదీ!

ఆనాడు ఫ్రాన్సులో జోన్ ఆఫ్ ఆర్కు వీరావేశురాలు వున్నదీ అంటే, మన దేశములో ఝాన్సీ లక్ష్మిబాయివంటి నిర్వి క్రమపరాక్రమురాలు వెలిసినది. ఏనాటికైనా లక్ష్మి, సరస్వతి, పార్వతీదేవులవలె పురుషులతోపాటు స్త్రీలుకూడా వుంటేనే త్వరలో దాస్యవిముక్తి కలుగుతుందన్నమాట మరిచిపోయి నావు కామాను! ఆనాడే విజయలక్ష్మి తనంతతానే వరిస్తుంది దేశాన్ని. అప్పుడు దేవతలు పూలవర్షము కురిపిస్తారు. పరమ పితయైన జగన్నాథుడు హృదయపూర్వకముగా ఆశీర్వదించు తాడు.'

బాలుడు చిఱునగవుతో 'అవునమ్మా, మరిచిపోయితిని. క్షమించు' అన్నాడు.

బాలచంద్రుడు 'అమ్మా నేనుకూడా రావద్దే యుద్ధానికి.'

నూతనపురుషుడు ముసిముసినవ్వు నవ్వుచు 'నువ్వెవ్వరితో యుద్ధము చేస్తావోయి. నాతో చెయ్యరాదూ, లేకపోతే పోనీలే గాలితో చెయ్యి చూద్దాము.'

పెద్దకుమారుడు 'ఏమండీ, నేను మాయమ్మ చెప్పినదాని కేమంటారు?'

బాలచంద్రుడు తెచ్చుకొనిన కోపముతో 'నేనిప్పుడు గాలితో కుస్తీపట్టి నేర్చుకుంటున్నా. పెద్దయ్యాక ఎవరు అడ్డు వస్తే వాళ్లమీద చేస్తాను యుద్ధము' అన్నాడు.

నూతనుడు పెద్దబాలునివైపు చూచి 'ఏమనుట కేము న్నది? మీవంటివారికి యేమిజవాబు చెప్పగలను. నీకు

చూస్తే పదిహేనుయేళ్లులేవు ; ఈవుపన్యాసాలు ఎక్కడ నేర్చు కున్నావయ్యా!' తల్లి 'మావాడు కొన్నాళ్లు ప్లాటుఫారము లెక్చరులుకూడా యిచ్చాడులెండి; అప్పుడు బాగా తరిఫీయతు అయ్యాడు.'

నూతనుడు : 'కాని యేమైనా మీవంటివారు పట్టణాలలో వుండి వుద్యోగాలు చేస్తూవుంటే యెంత కనులపండువుగా వుంటుందీ! ఇప్పుడు కచేరీలలోను, ఉద్యోగాలలోను వున్న మాలిన్యమంతా ఊడ్చిపెట్టుకుపోతుంది. అప్పుడు మీచేతి కింద పదిమంది బంట్రోతులు, ఆశ్రితులు కలకలలాడుతూ వుంటారు. ఏమైనా యిదేమో అడవిలాగు మనుష్య సంచార మైనా లేకుండా వొక్కరేవుండడమంటే నాకుమాత్రము నిజము చెప్తున్నాను కష్టముగానేవుంది. వచ్చి గంటన్నర కాలేదు యెల్లాగో బెంగగావుంది అప్పుడే.'

ఆమె 'మాకు పల్లెటూళ్లే స్వర్గలోకం. ఆ వుద్యోగపు దర్జాలు, నౌకర్లు, చాకర్లు మాకెందుకులెండి, మీవంటి వారికి గాని. బస్తీల చెడుగాలి, యిరకాటము, హడావుడి మేము భరించలేము. మాకీగొడ్లు, గోద, పాడి, పంట, యివేపదివేలు. స్వచ్ఛమైన నీటిలో హాయిగా స్వేచ్ఛగా తిరిగే మత్స్యాన్ని తీసుకువెళ్లి సింహాసనము మీద కూర్చోబెటితే దానికీ బంగారము, వెండి, రత్నాలు, వేషభాషలు ఎందుకూ? మీదుమిక్కిలి వుక్కిరి బిక్కిరి అవుతుంది కూడాను.'

నూతన పురుషుడు 'ఇప్పటికే చాలా ఆలస్యమైంది. వాన వెలిసింది కూడాను. నేనేమైనా తప్పులు మాటాడితే క్షమించండి. సెలవుపుచ్చుకుంటాను' అని లేచినాడు.

ఆమె 'మంచిది. నాయనా, వారి నంతవరకు పంపించిరా' అని చంటిపిల్లను, బాలచంద్రుని తీసికొని పొలము గట్టువైపు బయిలుదేరినది. పొలములో నెప్పటివలెనే ఊడ్పుకత్తెలు ఊడ్చుచున్నారు. నూతనపురుషుడు పెద్దబోదెమీది తాటిపట్టెలు జాగ్రత్తగా దాటి తుమ్మచెట్ల గుంపువరకు వెళ్లినాడు.

ఇంతలో ఇంటి యజమాని, పెద్దకుమారుడు కలిసివచ్చుట గని అమె లేచి మరల రెండువ్రేళ్లతో పెదవి నొక్కుకొన్నది. యజమానియు నటులే పెదవి నొక్కుకొని నవ్వుచు 'రోడ్డు ప్రక్కనే బోది బాగుచేయిస్తూ అతను మన యింటివేపు రావడము చూశాను. కనిపెట్టినావుకదూ!' అన్నాడు.

ఆమె 'తెలిశే మీదేవూరని కూడా అడగకుండానే పంపించివేశాను. మన రవుడీ అందరికంటే ముందుగానే పసిగట్టింది సుమండీ!' అన్నది.

*　　*　　*　　*

ఆరునెలలు గడచినవి. సాయంసమయము. ఆమె వంట చేయుచు లోపలఉన్నది. ఆయన పడకకుర్చీలో కూర్చుండి ఆంధ్రపత్రిక చదువుచున్నారు.

అప్పుడొక పోలీసుఇన్స్పెక్టరు, ఇర్వురుబంట్రోతులు వచ్చి ఆయనకొక కాగితము అందించినారు. ఆయన మౌనముతో

డనే ఆ కాగితము అందుకొని వంటయింటిలోనికి వెళ్లి నవ్వుచు "ఏమండీ, అమ్మగారు, మనకు సర్కారువారి సెలవుఅయింది, కృష్ణజన్మస్థానానికి రమ్మని ఇద్దరినీ. వంట కొంచెం ఆపు చేయించండి, వచ్చే సంవత్సరం వచ్చి మరల వంట చేసుకో వచ్చు. ఈ లోపుగా నీకూ, నాకూ కూడా విశ్రాంతి" అని ఆమెకు కాగితము అందించినాడు. ఆమె వారంటుచదివి వెంటనే బయటకు వచ్చినది; ఆయనకూడా వచ్చినాడు.

ఇంతలో పెద్దకుమారుడు, బాలచంద్రుడు, రవుడీ కుక్క పరుగునవచ్చి, తలిదండ్రుల ప్రక్క జాలిగొలిపే వదనాలతో నిలుచున్నారు. రవుడీమాత్రము చాలరోజులక్రింద మామూలు పెద్దమనిషిలాగు వచ్చి వెళ్లిన ఇన్స్పెక్టరును ఆనవాలుపట్టి "భోంయి భోంయి" మని మొఱిగినది. బాలచంద్రుడు దానిని ఆపుచేయుచున్నాడు.

ఇన్స్పెక్టరు భయముతో "అమ్మా, ఇదిమావిధి. పోలీసు ఉద్యోగంలో చేయకూడని పని అంటూలేదు. తమవంటివారికి కూడా వారంటు తీసుకురావలసిన దురవస్థ నాకుపట్టింది. తమరిద్దరూ మొన్న పౌన్నూరులో రాజద్రోహకరమైన ఉపన్యాసాలు ఇచ్చినందుకు ఫలితంగా మా దొరవారిచే జారీ చేయబడింది ఈ కాగితం."

ఆమె "అయ్యా, మే మెప్పుడూ అందుకు సిద్ధముగానే వున్నాము. ఇందులో తమరుచేసిన తప్పేముందీ!"

ఇన్స్పెక్టరు "అమ్మా, తమరు తీరికిగా బయలు దేరవచ్చును. తొందర యేమీ లేదు."

ఆమె "అయ్యా, మేము సరుదుకునేది యేముందీ, (పెద్ద కుమారునితో) నాయనా, తమ్ముణ్ణి జాగ్రత్త, పాపను నా వెంట తీసుకువెళ్లుతాను. ఆ తర్వాత చేయవలసిన అజ్మాయిషీ అంతా నీకు తెలిసిందే. (ఇంతలో అక్కడ గుమిగూడిన పని వాళ్లను చూచి, దిగాలుపడివున్న మేస్త్రితో) అప్పన్నా, ఏమీ విచారించకు. మనము ప్రతిరోజూ చూడడములేదా, ఒక గింజను పాతిపెడుతున్నామూ అంటే ఎందుకూ, అందులో నుండి ఫలపుష్పాలు మనము అనుభవించాలి అంటే, ఆగింజ భూమిలో కొంతకాలము ఉండాలి, తనరూపే మారిపోయి, అంతేకాదు ఆ గింజ తాను నశించిపోయి, తనలో నుండి మొక్క, మొక్కనుండి పువ్వులు, పండ్లు యిస్తూంది. ఆ గింజ నశించితే కాని దానివల్ల మనకు ఫలం దక్కడములేదు. మా జీవితాలు కూడా అంతే. సర్వమూ త్యజించడానికి—"

అక్కడున్నవా రందరికి కనులనుండి కన్నీటిబిందువులు రాలినవి. పోలీసుఉద్యోగము చేసి గుండె బాయిచేసికొనిన యిన్స్పెక్టరు కూడా తలవంచి ఒకటిరెండు కన్నీరు విడిచినాడు.

ఆయన, ఆమె చంటిపిల్లను తీసికొని బయలుదేరినారు, పోలీసువారు వెంట. అదుపాజ్ఞలలో పెరిగిన పిల్లలిద్దరు పని

వాళ్లు అటులనే ఉండిపోయినారు. చీకటిముసుగు ఆవరించు చున్న దొక ప్రక్కనుండి.

తమ్ముని ప్రక్కన కూరుచుండజేసి, పెద్దకుమారుడు రెండు చేతులుజోడించి :

"కనికరమెదలో కరగి పారగా,
అనదల కష్టములన్నియు దీర్చెడి
దినమది సుదినము కాదా, ప్రభూ!"

పరమపితను గూర్చి గానము చేయమొదలిడినాడు.

## వలపు కాన్క :

అతడు చామనఛాయ మనిషి, వయస్సు ఇరవై అయిదు. ముఖము నిర్మలము, కోమలము, గంభీరము. భావసంపద, భావస్థిరత్వము ఆ కళ్ల వెలుగులో మెరుస్తూఉంటవి. చిన్ని గుండ్రనిగడ్డము గాంభీర్యము కోమలత్వము కలిసి పులకరించే ఏదో భావాన్ని తెలుపుతూఉంటుంది. విశాలమైన నెన్నుదురు, అప్పటప్పట అచట వానంతట అవే వచ్చే ముడతలు సాధన గల ఆత్మను స్ఫురింపజేస్తుంటవి. అంత బలిష్ఠమైన శరీరం కాదు, ఒకమోస్తరు.

ఆమె కూడా చామనఛాయ. వయస్సు ఇరవయి. చక్కని ముఖము. స్త్రీకి సహజంగాఉండే సుకుమారత బాగాఉంది. ఏదో అర్థముకాని తేజస్సు ప్రకాశిస్తుంటుంది. కళ్లలోనుంచి బయల్వెడలే సిగ్గుదొంతరలు ఆ తేజస్సును అప్పుడప్పుడు కప్పి వేస్తూఉంటవి. అప్పుడప్పుడే కాదు తరుచు చిఱునవ్వు నవ్వు తూనే ఆమె తెరలుతెరలుగావచ్చే సిగ్గుకెరటాలలో తేలి ఆడుతూఉంటుంది. పెదవులు గభీరత నెంతమాత్రము తలపుకు తేక సుకోమలత్వాన్నే స్ఫురణకు తెస్తవి. నుదురంత విశాల మైనది కాదు. ఆమె ప్రతివిషయము మామూలుగానే చూస్తుంది. భావములే కాదు హృదయంకూడ అంతలోతు గలది కాదు. ఇన్ని వివరించేకంటే ఆమె సాధారణంగా వర్తించే ఒకానొక విద్యార్థిని అంటే !—పలుచనిశరీరం. అంతపొడగరి

కాదు. భూషణములా—నవ్వుచూనే ఆమె క్రిందటిసారి వచ్చిన రాజకీయపు ఉప్పెనలో వదలిపెట్టివేసింది ఉన్నవన్నీను. అంద రూఇస్తున్నారు నేనెందుకు ఇయ్యకూడదని కాదు, అప్పట్లో ఆమెమనస్సు కరిగింది. కాని తర్వాత ఎప్పటి చిఱునగవుతో—

౨

అది శ్రావణమాసము. సాయంకాలము అతడు పొంగి పొంగి వస్తూవున్న గోదావరి చూస్తూ నడచుచున్నాడు గట్టుమీాద. వ్రేలు ఆనవాలు పెట్టుకొనివున్న గ్రంథము చేతిలో ఉంది. మనస్సు పుస్తకంమీాద వున్నప్పటికీ కనులపండువుగా గట్టు రాసుకొని ప్రవహిస్తూవున్న గోదావరి, అందులో కొట్టుకొని వచ్చే పుల్ల పుడక, పెద్దపెద్దచెట్లు ఇవన్నీ అతను ఎంతోకోరి కతో చూస్తున్నాడు.

ప్రక్కనుంచి నలుగురుపిల్లలు వెళ్లారు. అందులో ఆమె ఉంది. అతన్ని ఆమె చూచిందో లేదో కాని అతడుమాత్రము ఆమెను చూచాడు. అంతే, తర్వాత మనస్సు కొంచెముసేపు గోదావరిమీాదికి, చేతిలోని పుస్తకంమీాదికి పరుగెత్తింది. వెంటనే అప్పటి నిండు గోదావరి, జీవితానికి జీవితపరమావధికి అనుబంధమైన ఎదో భావాన్ని స్ఫురింపజేయగా అతడు దాన్ని మననముచేయ మొదలుపెట్టాడు. అంతటితో ఆమెవూనే మరిచిపోయాడు.

మిత్రులు రాగానే కొంతసేపు గట్టుపైన కూర్చుండి ఈక బురు ఆకబురు మాటాడుకొని బయలుదేరడానికి లేచాడు. గోదావరి మీదుగా పడమటిదిశ ఆకాశంలో నెలవంక కనిపించింది. వెంటనే ఈ మహానది ఎంతమంది ప్రేయసీ ప్రేయసులను చూచిఉంటుందో అనుకొన్నాడు. మరు నిముసాన్నే యిందాక ఆగుంపులో వెళ్లిన ఆమె స్మృతికితోచింది. ఏమో అనుకొన్నాడు నిర్లక్ష్యంగా.

అతడు చిన్ననాటినుంచి ఆలోచనగలమనిషి. ప్రతిచిన్న విషయాన్నిగురించికూడా లోతుగా ఆలోచించే స్వభావము. కోమలమైన, నిశితమైన అతనిబుద్ధికి హిందూసంఘములో ఉన్న కులభేదాలు, మూఢాచారాలు, వెఱ్ఱినమ్మకాలు, భావదాస్యం, సొంతంగా ఆలోచించేబుద్ధి లేకపోవడము, అజ్ఞానం, ఎంతో బాధ, దుఃఖము కలిగిస్తూఉంటవి. ఇటువంటి పెద్దపెద్ద సంగతులు అతని హృదయాన్ని కలచివేస్తూఉండేవి. వీటిగురించి గ్రంథములు తరచడమేకాదు, అతను సొంతంగా ఎంతో ఆలోచించాడు. ఇట్లుండగా రెండోసారి రాచకీయపుతుపాను రెట్టింపు బలంతో వచ్చింది. ఇందులో తాను కొట్టుకుపోతానేమో అనుకొన్నాడు. అందుకు కొంచెము జడిశాడనికూడా చెప్పవచ్చు. ఈ నడుమ దాన్నిగురించి అత నెంతో దీర్ఘంగా లోతుగా తన్నుతానే తరుచుకుంటున్నాడు: “సంఘం యిటువంటి దుర్దశలో కుళ్లుతో జీవితం గడుపుతుంటే రాచకీయపు స్వతంత్రము ఎంతవరకు అవసరం? ఒకవేళ దేశానికి స్వరా

జ్యంవస్తే వ్యక్తిగతంగా ప్రయోజనం ఏమిటి? ప్రత్యేకవ్యక్తికి మానసికంగా ఎంతవఱకు ముక్తి ఉంది? " ఈ ఆలోచనలు ఎన్నాళ్లనుంచో, ఈరోజునకూడా, అతని హృదయాన్ని మేథస్సును పరిపాలిస్తున్నవి.

వీటిగూర్చి చింతిస్తూనే అతడు ప్రక్కపై పరుండి ఉన్నాడు. ప్రక్కనే ముడిచివేసిన పుస్తకము ఉంది. మరల ఆమె అప్పుడప్పుడు స్ఫురణకువచ్చుచుండుట అతడు గమనించాడు: "ఏమి చెప్పుము!— " అనుకొన్నాడు.

కొంతసేపటికి కిటికీలోనుంచి బాలచంద్రుడు కనిపించాడు. చుట్టూ ఎన్నో నక్షత్రాలు మెరిసిపోతూఉన్నవి. అతనికి చుక్కలంటే ఎంతో యిష్టము. నెలవంకకూడా యిష్టమేకాని చుక్కల్లో అతనికేదో తియ్యని సంగీతము, మెరుపులు కనిపిస్తూ ఉంటవట. కాని నేడు నెలవంక అతనిదృష్టిని ఎక్కువగా ఆకర్షించింది. రెప్పవేయక, ఊర్పునాపి రవంతసేపు చూచాడు: "పురుషుని జీవనాకాశంలో ప్రేయసికూడ అల్లాగే కామాసు" అనుకొన్నాడు. వెంటనే ఒక మబ్బుతునక నెలవంకను కొంచెము కప్పివేసింది. అతని హృదయవీణను ఎదో కనిపించని చేయి మీటిన ట్లయింది: "దేహంలో కలిగే మార్పువల్లనేమో" అనుకొన్నాడు.

"ముత్యాలను గీటురాయిమీద విలువ కడితే యేమి తెలుస్తుంది" అని సమాధానం చెప్పుకొన్నాడు తనలోతానే. ఈ సారి ఆమె స్మృతికి రాలేదు.

## 3

స్త్రీలో లేని గుణాలు యువకులు కల్పించుకుంటారనీ, లేని పోని సౌందర్యం ఊహించుకుంటా రనీ, తెలివితక్కువతనం వల్ల ఆమె చీరముడుతలలో, శిరోజములలో, అడుగులలో, కదిలే వ్రేళ్లలో ఏమేమో వింతవింత కళలు తెచ్చిపెడతారనీ, ఆమె మాటలలో, కంఠంలో, గమనంలో వెఱ్ఱిమాధుర్యము ఊహచేస్తారనీ, పురుషు డెంతో స్త్రీకూడా అంతేకాని అంత కంటె ఎక్కువకాని, తక్కువకాని స్త్రీలో లేదనీ, ఒక స్త్రీ యింకొక స్త్రీ యెడల ఎటువంటి నిష్కామమైన దృష్టితో ఉంటుందో అటులే యువకులు కూడా స్త్రీయెడ వర్తించవలె ననీ, అదికూడా సంఘోద్ధరణకు యితరవిషయములతో పాటు సమానమైన అవసరం గల సంగతనీ తోడియువకులతో అనేక సార్లు అతడు చెప్పాడు. అతడు స్త్రీయెడ అటువంటి నిష్కామమైన దృష్టితోనే ప్రవర్తించుతాడని అందఱు అనుకుంటారు. అంతేకాదు స్త్రీలనుచూచి యువకులు ముగ్ధులై తెలివితక్కువవారై పోవుచున్నారని అతడు అప్పు డప్పుడు స్త్రీ జాతిని నిందించడముకూడా కలదు.

కొన్ని నెలలు గడచిపోయినవి. ఆమె అతనికి ఒకటి రెండు సారులు మాత్రమే కనిపించింది. అప్పు డాతని హృదయం అతనికి తెలియకుండానే కొంచెము వణికింది. నరములుకూడా వణికినట్లయినవి. ముఖము తెల్లబారింది. చూపులు ఆమె

మీాదికి ఇటు అటు పరిగెత్తినవి. ఎందుకో అతనికి తెలియు లేదు. ఆపుచేసుకోవలెనని ప్రయత్నించాడు. ప్రయత్నము మీాద లోబరచుకున్నాడు హృదయాన్ని, కళ్లను.

ఆమెమాత్రము అతనివైపు చిరునగవుతోనే ఒకటి రెండు సార్లు చూచింది. చిరునగవుతోనే తలవంచుకొనేది. నవ్వు చూనే సిగ్గుతో కళ్లుమూసుకొనేది. ఇదంతా ఒక్క నిమిష ములోనే.

ఒకరోజున టవునుహాలులో టీపార్టీ అయింది. స్త్రీలు పురుషులుకూడా వచ్చారు. అతడును వచ్చాడు. ఆమెకూడా చెలులతో వచ్చింది.

కొంచెముసేపటికి జనసమ్మర్దము ఎక్కువైపోయింది. వడ్డన సరిగా జరగడములేదు. అంతవఱకు పై అజమాయిషీ చేస్తూ ఉన్న అతడు వడ్డన కందుకొన్నాడు. స్త్రీలదగ్గరకు ఫలహారాలు ఒక్కటీ సరిగా వెళ్లడములేదు. అతనికి అడ్డు ఏముంది! అంతేకాదు నియమములు, స్థిరమైన భావములు, సాధన ఉన్న సంస్కారి. ఆమె అక్కడ ఉండడము అతడు చూచినాడో లేదో కాళ్లు రవంత తడబడినవి, చొరవచేసుకొని వెళ్ళాడు. వడ్డిస్తూఉన్నాడు. ఆమెకు దగ్గరగా వచ్చాడు. ఆమెకుకూడా వడ్డించాడు ఫలహారాలు. ఆమె చిరునగవుతోనే అందుకొన్నది. మధ్యమధ్య ఆమెను సిగ్గుదొంతరలుమాత్రము కప్పివేస్తూఉండేవి. అయినా ధైర్యంగా ఆమె రెండవసారి టీ అడిగింది. అతడే తీసికొనివచ్చి మాటాడకుండా యిచ్చి వెళ్లిపోయాడు.

ఈ సారి అతడు ఆమెను జాగ్రత్తగా చూచాడు. ఇంతకు పూర్వము అత డామెను ఈ రీతిగా దృష్టి సారించి చూడ నైనా చూచి ఉండలేదు.

అత డెరుగును ఆమె వ్రేలెత్తి చూపదగినసౌందర్యవతి కాదని. ఆమె సర్వావయవములు మామూలుగానే ఉన్నవి కాని అందేమియు ప్రత్యేకతకూడా లేదని. అయినను అతని నామె ఏలనో ఆకర్షించింది. ఎందుకో ఎట్లో ఆతనికే తెలియదు. అతడు దృఢచిత్తము కలవాడు. నియమములు, కొంత వరకు స్త్రీజాతిఅంటే అయిష్టము ఉన్నవాడు. అవన్నియు మెల్లమెల్లగా సమ్మోహనమునకు చోటిచ్చినవి. ఆమె రూపవతికాదు. అయితేనేమి ఆమెలో ఏదో అతడే యెరుగడు అతనిని ఆకర్షించింది! ఇంతవరకు ఒక్క సౌందర్యమే ఆకర్షిస్తుందని తలంచే అతనికి ఇదొక క్రొత్త అనుభవము. ఈ అనుభవములో మాధుర్యము అతడు అపేక్షతో చూరగొన్నాడు. కాని తన్ను తాను ప్రశ్నించుకొనేవాడు: "ఎందుకు!...... జీవిత పరమావధిమాట......!" అని. "స్త్రీ కూడా ఒక జంతువే. స్త్రీకి తెలివి తేటలుకూడా ఎక్కువలేవు. సౌందర్యముకూడా ఎక్కువకాదు. పురుషుడే స్త్రీకంటే ఎక్కువ అందమైనవాడేమో కూడాను......గ్రీకు శిల్పులు తమకళలో... మరి నన్ను ఆమె దేనితో ఆకర్షిస్తూఉంది...! అదే అర్థము కావడములేదు. అర్థమయ్యేదేముంది! పదిరోజులు తప్పిం

చుకుతిరిగితే ఈ పిచ్చిభావాలు, అపేక్ష వానంతటవే మాయ మవుతవి ” అనుకొన్నాడు.

పచ్చికబయళ్లు తాత్కాలికంగా ఎండిపోయినట్లు కనిపించినా తొలకరించగానే నవజీవంతో మెరుస్తవి అనే విషయము అతను మరచిపోయాడు. మరచిపోవడము కాదు తన హృదయం రాతినేలవంటి దనుకొన్నాడు. స్త్రీలయెడ తాను నిష్కామంగా స్త్రీవలె ప్రవర్తించవలెనని దృఢచిత్తం చేసుకొన్నాడు. అంతే కాదు స్త్రీ మనోహరత్వానికి లోబడిపోవడము పురుషుని హృదయదౌర్బల్యము తెలియపరుస్తుందని అతని నమ్మిక. అంతటితో ఆగలేదు, పాపముకూడానేమో అని అనుకుంటూ ఉంటాడు.

౭

మూడునెలలు గడచినవి. ఆమె కాతడు ఒక్కసారీ కనిపించలేదు. బుద్ధిపూర్వకంగానే తప్పించుకు తిరిగేవాడు. ఆమెను మరిచిపోవలెనని ప్రయత్నించాడు. మరిచిపోవడము అంత కష్టమైనపని కాదనుకొన్నాడు. మరిచిపోయాననుకొని తృప్తి పడ్డాడు. మరిచిపోయినందువల్ల బాధ లేదనుకొన్నాడు. పూర్తిగా మరిచిపోయానో లేదో అని పరీక్షచేసుకోవడము లోనే ఆమెస్మృతియింకా తనలో ఉందనుకొన్నాడు. ఏమైనా ఆమె నీడజాడలు అతని హృదయవీధిలో గోచరిస్తునే ఉండేవి.

అది సాయంసమయము. మబ్బులుపట్టి చల్లగావుంది. అతడు టేబిలుముందరకూర్చుండి తీవ్రంగా చదువుకుంటు న్నాడు. మనస్సు ఉత్సాహంగ, చురుకుగా పనిచేస్తూ ఉంది. పెద్దపెద్ద భావాలు కెరటాలులాగావచ్చి పరిగెత్తుకుపోతున్నవి. ఈ విశ్వవిశ్వమంతా అప్పు డతనికి లేనట్లే.

గచ్చకాయరంగు చీర కట్టుకొని, సరిగంచు జాకెట్టు ధరించి, తలలో పారిజాతపు పూలగుత్తులు పెట్టుకొని సిగ్గుతో తలఆడిం చుకుంటూ చిఱునవ్వుతోనే ఆమె వచ్చింది. ఆమెను సరిగా చూచినాడో లేదో ఒకమెరపు మెరసినట్లయింది. ఆ మెరపు దెబ్బకు హృదయము, మనస్సు, మేధస్సు ఒక్కసారిగా క్రుంగి మఱుక్షణాన్నే నవజీవంతో లేచినవి. మెల్లగా అడుగులు వేసుకొంటూ శిరస్సు వంచుకునే తడబడుచు ఆమె చెట్లనీడ లలోకి వెళ్లుతూ వుంది. అతడు మరల తలయెత్తిచూచాడు. ఒత్తుగా మెరసిపోతూవున్న పెద్దజడ కనిపిస్తూవుంది. తన హృదయం ఆమె అడుగుల ననుసరించి శబ్దించుట అతడు కని పెట్టాడు. తన మనస్సు నామె బలంగా లాగుకొనిపోవడము గ్రహించాడు. తాను అంతలోనే మానసికంగా నీరసం అయి పోవడము తెలుసుకొన్నాడు.

కోపంతో ఇకెన్నడు ఇటువంటిపని జరుగకూడదు. ఒకపేరు వూరు లేని యువతి నన్ను లోబరచుకోవడమేమి టనుకొ న్నాడు. ఆమెలో వున్న గొప్పతన మేమిటని ప్రశ్నించుకొ న్నాడు. ఇంత తెలివితక్కువగా ఆమెముందు కూలబడిపోవడ

మేమిటనుకొన్నాడు. ఆమెకు నాకు ఏవిధమైన అనుబంధం అనుకొన్నాడు. ఇక ఈ సారి ఘుట్టి పతనమునకు అవకాశ మివ్వకూడదనుకొని నిశ్చయం చేసుకొన్నాడు. ఇదంతా ఒక్క అరనిమిషములో.

పుస్తక మక్కడుంచి లేచివచ్చి కిటికీప్రక్కనున్న కుర్చీలో కూలబడ్డాడు. ఆ తీవ్రత తగ్గిపోయింది. మనస్సుకు మృదుత్వం అంతలోనే అబ్బింది. శాంతంగా ఆలోచించ మొదలు పెట్టాడు. జీవితంలో స్త్రీకి పురుషునికి వున్న సంబంధ మేమిటి, ఎంతవర కుండాలి, ఎప్పు డేరీతిగా వుండాలి, స్త్రీ పురుషులకు అసలు పరస్పర సాహాయ్య మెంతవర కవసరముంది, ప్రేమ నాధా రంగా చేసికొని స్త్రీ, పురుషుడు ఏల నివసించరాదు. వివాహం అసలు అవసరమా లేదా. వివాహంలేని పరస్పరప్రేమకు, నిజ మైన ప్రేమలేని వివాహానికి తారతమ్యమేమిటి......(మనో తీవ్రత మెల్లగా బిగిసడలింది) నా హృదయంలో ఎందుచేతనో ఈమెమీాద అపేక్షకలిగింది, ఇది ఎంతవరకు ప్రకృతిసిద్ధ మయింది......ఒక స్త్రీని ప్రేమించుట ఆమెకు లోబడిపోవడ మెల్లా అవుతుంది......ఒక రమణిలో వున్నదేదో కనిపించని మనోహరగుణము ఆకర్షించితే అందుకు అవకాశమివ్వడము, కనిపించని సౌందర్యాన్ని ఆరాధించడము పాప మెల్లా అవు తుంది......ఆమెను నేను కోరడమో లేక ఆమెకు నన్ను అర్పించుకోవడమో, కాదు ఈ రెండూకలిసి ఏదో చెప్ప జాలని దవుతుంది అటువంటి ప్రణయజీవనం గడపడములో

దోషముంటుందా......ఇన్ని ఆలోచించడమేకాని ఆమె దృష్టి నాయెడల ఎట్లుందో ఊహించనైనా ఊహించకుండా, తెలుసుకోవడానికైనా ప్రయత్నించకుండా......" అంతలో ఆమె తిరిగివచ్చింది. ఆమె చిఱునవ్వు నవ్వుతూనే ప్రకాశిస్తూ వున్న ముఖంతో అతనివంక కిటికీగుండా చూస్తూవుంది. ఇదివరకువలె అప్పుడాతనిలో విద్యుత్తరంగము లెగయలేదు. ఆ ఆలోచనా చింతనములో మునిగిపోయివున్న అతని వదనం అప్పుడు భావసంపద స్ఫురింపజేస్తూవుంది. అందు చిఱునవ్వు తునుక అయినా లేదు. అత డామెను కొలదిపాటి గంభీరమైన ముఖముతోనే చూచాడు. వారి యిరువురి చూపులు సంపూర్ణముగా మిళితముకావడము ఇదే తొలిసారి. ఒకరిచూపు చిఱునవ్వు వెన్నెలలు ప్రసరింపజేస్తూవుంది. ఇంకొకరి చూపులో భావముల వెలుగుమాత్రమే మెరుస్తూవుంది. పాపము, ఆమె అతడు తనవంక తీవ్రంగా చూస్తూన్నాడేమో అని సంశయించింది. వెరపుతో తలవంచుకుంది. నడుస్తూనే మరల చిఱునవ్వుతో అతనిని చూచింది. ఈసారి అతడు చిఱునవ్వు నవ్వ ప్రయత్నించాడు. లోతుగల అతని భావాలు అప్పుడు చిరునవ్వుకు చోటివ్వలేదు. ఎన్నోరసాలు ప్రసవించే భావా లప్పుడతని వదనముమీద తాండవమాడినవి. ఆమె గ్రహించింది. ఆమె చిఱునవ్వు చూపులతోనే అతని కొక పూజాపుష్పము సమర్పించింది. అత డాపూజాపుష్పాన్ని ప్రేమతో, కోరికతో అందుకొన్నాడు.

ఆమె మెల్లగా అడుగులువేసింది. పూలచెట్లలోనుంచి వచ్చిన కమ్మనివాసన లామెకు తమ ఆనందము తెలిపినవి. ప్రక్కగుబురుగావున్న బొగడచెట్టుపైని గువ్వలుకూడా తమ సంతోషము వెలిబుచ్చినవి. ఒకటి రెండు చినుకులతో, తన కుంకుమపురంగు కరాలుపంపి సూర్యుడు ఆశీర్వదించాడు.

"నా భవిష్యత్తు అనంతమైన శూన్యాకాశం. అందులో నెలవంక ఎప్పు డుదయిస్తుందో" అనుకొన్నా డతడు.



# లక్ష్మీరామేశ్వరము:

౧

ఆమె "నిజముగా చెప్పండి ; మరల పెళ్లిచేసుకోరు కదూ ?" అనెను.

రామేశ్వరుడు దీనవదనముతో "లక్ష్మీ ! నీ మాటలు నేను వినజాలను. ఈ రోజున ఏమిటి నీవు నాహృదయమును దహింప జేస్తున్నావు." అనెను.

ఇరువురును నూతనయౌవనులు. రామేశ్వరుడు ఇరువది నాలుగు వత్సరముల ప్రాయమువాడు ; లక్ష్మి పదునెనిమిది వర్షముల యువతీమణి. ఒకదినమున అపరాహ్ణసమయమున ఈ సతీపతులిరువురు చతురంగము ఆడుకొనుచుండిరి. ఆట నడుమ లక్ష్మి సంభాషణమును మార్చి పై విధముగ దీసికొని వచ్చినది. సహజకోమలహృదయుడు—రామేశ్వరుడు ప్రియతమ, మితభాషిణియగు లక్ష్మి ఇట్లు మాటాడుటగని ఆశ్చర్యపడుటయేగాక అంతరంగమున చాలబాధ ననుభవించు చుండెను.

లక్ష్మి లేనినవ్వు తెచ్చుకొని మిగుల మధురము, మిగుల కఠినముగాని కంఠస్వరమున "మీ మనసుకు బాధకలిగించ తలెనని నామతముకాదు. మీరేమనుకొనినాసరే. ఈ ఒక్క విషయంలో నాకు స్వేచ్ఛప్రసాదించి నిక్కముగా జవాబు

చెప్పండి. ఇక నే నేమీ మాటాడను ". అని పతివైపు పిచ్చి దానివలె జూచుచుండెను. ఆ చూపులో భావమేమియులేదు. అర్థమంత కన్నలేదు.

రామేశ్వరున కెన్నడు లక్ష్మిపై గోపమురాలేదు. అప్పుడప్పుడు రామేశ్వరుడు భార్యను గోపించుచుండునని లోకులనుకొనెదరుగాని ఆ మాటలో గొంచెమైనను సత్యము లేకపోలేదు. ఇదివఱకు వచ్చినది కృత్రిమకోపము. వివాహమై ఆరు వత్సరములు గడచినవి. లక్ష్మిపై నిజమైనకోపము ఈ రోజున మాత్రమే వచ్చినది. రామేశ్వరుడు చటాలున దనప్రక్కనున్న తిలకుగారి 'కర్మయోగశాస్త్రము' దీసి శిరసునబెట్టుకొని కోపముతో "లక్ష్మి! ఇదే నేను ప్రతిజ్ఞచేస్తున్నాను. నా లక్ష్మి జీవించియున్నను లేకపోయినను నేను పరస్త్రీ ముఖం తలయెత్తి చూడను. (కొంచెము నేపూరకుండి) ఇకనైనా నన్ను వదలుదువా?" అని చతురంగపుఆట సాగించెను.

పతివ్రతాశిరోమణి యగు లక్ష్మి తలవంచుకొనినది. ఒకటి రెండు అశ్రుబిందువులు కనుకొలంకులనుండి జారినవి. భర్త ఆ విషయము గాంచలేదని యాముద్దరా లనుకొనెను. గాని రామేశ్వరుడు చూడకపోలేదు. అతని నవనీతకోమలహృదయము విదారితమై పోవుచుండెను. జోస్యము చెప్పగలవారైనను ఆ రంగముగాంచి రామేశ్వరునిది "అసలైన ప్రేమ" అని యనకుండజాలరు.

౨

పదునొకండు మాసములు గడచినవి. లక్ష్మి మార్గశిర బహుళ ఏకాదశినాడు అర్ధరాత్రమున ఆడశిశువును ప్రసవించినది. కాలగర్భమున లీనమగు చున్న వారందఱు నేల అట్లగు చుండిరో ఎవరు సిద్ధాంతీకరించి చెప్పగలరు? బహుళ ద్వాదశి సాయంసమయము. అంధకారము మెలమెల్లన ఆవరించుచున్నది. అనంతనీలాకాశము, పక్షులు, వృక్షములు, మందపవనుడు, సర్వముగూడ దుఃఖించుచున్న భంగి తోచుచున్నవి. లక్ష్మి—ప్రాణవాయువు ఈ పాంచభౌతిక దేహమును విడిచిపెట్టి పోయినది. పూళ్లగ్రామమున—ఆ దుఃఖమయ భవనమున ఎల్లరు దుఃఖితహృదయులై యుండిరి. ఒకరిద్దరు మాత్రము బిగ్గరగా నేడ్చుచున్నారు. ఎంతఏడ్చిన నేమిప్రయోజనము! నీటిబుడగవంటి శరీరమును విడిచి ఆత్మ పరలోకమునకు బోయినది. ఒకవిరాగి ఆ త్రోవను బోవుచు "ఎందుకు దుఃఖపడతారు?" అనుకొనెను.

3

పరమేశ్వరుడు "లక్ష్మిఅను ఈ ఆత్మ నరకలోకానికి పోవలెను"

లక్ష్మి—ఆత్మ "ప్రభూ! నరకలోకానికి నాకేమీ పోవడానికిఅభ్యంతరములేదు. మీఆజ్ఞానుసారం అల్లాగె వెళ్తాను. నా భర్త, నేనూ చాలా అన్యోన్యంగా వుండేవాళ్ళము. నేను

మానవశరీరములో వున్నప్పుడు ఆయనను విడిచి ఎప్పుడూ వుండలేదు. వివాహమైన తర్వాత ఆయన్ను విడవవలసివస్తుందని పుట్టింటికికూడ వెళ్లలేదు. ఆయనకూడా నేనంటే అంత ప్రేమాతిశయముతో వుండేవారు. మీ ఆజ్ఞ అయింది విడవలేక విడవలేక నా ప్రాణేశ్వరుని విడిచివచ్చాను. ఏం చెయ్యను; విడిచిరావలసివచ్చింది. ఒక్కసారి నేనాయన్ను దర్శించుకురావడానికి—ఓదార్చడానికి సెలవు దయచేయించండి ప్రభూ! ఆయన నాకోసము ఎంతదుఃఖిస్తూవుంటారో నేనేమి మనవి చేయగలను! ఒకనిముసమైనా విడువకుండా వుండే నా హృదయేశ్వరుని అపార దుఃఖసముద్రములో—నిబిడాంధకారబంధురమున విడిచివచ్చేశాను. నన్నువిడిచి—ప్రియతమయైన ఈ దాసినివిడిచి నా ప్రియతముడు ఎల్లావుంటున్నాడో భావించుటకు కూడా నేను సహించలేకుండా వున్నాను. నేను పువ్వుల్లోపెట్టి పూజించే దాన్ని. అంత కోమలంగా వుండే ఆ సుకుమారమూర్తిని 'నా కోసం దుఃఖించవద్దు. జరగవలసినట్లు జరుగుతుంది' అని వోదార్చి కన్నీరు తుడిచివస్తాను. సర్వము తెలిసిన ప్రభువగు నీకు నేనేమి చెప్పగలను. దేవా! సెలవు దయచేయించండి!" అని వినయవినమితయై చెప్పుకొనెను.

పరమేశ్వరుడు " వెళ్ళిరమ్మ."

ఆత్మ పరలోకమును విడిచి భూలోకమును ప్రవేశించెను; భర్తృగృహాభిముఖయై వెళ్లుచున్నది. ఇంతలో నొకయూరునందు రామేశ్వరుని కంఠస్వరము వినిపించెను. ఆ యాత్మ

త్వరితముగ ఆ మందిరమును ప్రవేశించి రామేశ్వరుడు నవనవోన్మేషయగు నొకరమణీమణి చెంతగూర్చుండి ప్రణయసల్లాపము లాడుచుండుట గాంచెను. "ఏమీ! ఈమెయెవతె (కొంచెమాలోచించి) ఔరా అప్పుడే ద్వితీయవివాహమా!—మోసము, మోసము, ఇంతకన్న మోసమున్నదా, ఏ లోకములోనైనా?

ఇచట కూర్చున్నది నా ప్రాణేశ్వరుడేనా! ఇటులు జరుగుతుందా? ఆప్రేమ, ఆ ఆదరము, ఆ అభిమానము ఎక్కడికి పోయినవి. ఎంతో దుఃఖస్తూవుంటాడనుకొన్న భర్త ఆనందమున వోలలాడుటయా?—నేను నమ్మజాలను.

ఏమీ! ఆనాడు భగవద్గీత నెత్తిపై బెట్టుకొనిప్రమాణం కూడ చేసెనే? ప్రమాణముతో లెఖయేమి. అంత ప్రేమతో వుండె భర్త ఇంకేలోకములోనూ వుండడు అనుకున్న నా భర్తయేనా ఇట్లయిపోవుట. అయ్యో దేవా! నీవెంత విచిత్రుడవు! నా భర్త లోపమేమియు లేదు. నీదే బాధ్యత—

అయ్యయో! పరమేశ్వరుని తూలనాడుతున్నానా? 'సర్వమునీవే. నీవు లేకపోతే ఏమీలేదు' అనుచుండే నా భర్తననవలెను కాని. నన్ను శాశ్వతధర్మపత్నిగా స్వీకరించినట్లు అగ్నిసాక్షిగా ప్రతినకూడా చేసెనే! 'నిజమైనప్రేమ' నా భర్తది. ఇతరుల దందరిది బూటకపుప్రేమ అనుకొన్న నేను అది ప్రేమకాదు కామము అని అనుకొనవలసి వచ్చిందా

ప్రభూ! దేహాన్ని మాత్రమే కామించే భర్త నిజమైనభర్త యెట్లగును!

ఈతడే దైవము వేరే దైవములేదను కొనేదాన్ని. ఒకసారి ఒకనెచ్చెలి భర్తను దైవము లాగుచూడాలి కాని భర్త దైవము కాజాలడు అని చెప్పింది. ఆమెమాట లెఖచెయ్యలేదు. ఈతనికింటె ప్రేమింపదగినది ప్రపంచంలో ఇంకేమీలేదు. ఈ యనే నేను; నేనే ఈయన అనుకొని ప్రేమించినందుకా ఇట్లు మోసగించుట. అయ్యో ప్రభూ! నిన్ను గ్రహించుట ఎల్లాగు? ఇక ఆచంటిపాపగతి ఏమవుతుందో. ఇంత చిత్తచాంచల్యముగల మానవులను ఎట్లు నమ్మగలను? 'పురుషులను నమ్మకూడ' దని దేవుడు వ్రాసిపెట్టి వుంచాడు కాబోలు. ఆ సంగతి ఇదివఱకు తెలియలేదు. పురుషు లిలాంటివాళ్ళని తెలుసుకో లేకపోయాను. ఇంకా యెందుకిక్కడ? ఇకపోతాను." అనుకొని పరలోకమునకు ప్రయాణమయ్యెను.

## ౪

లక్ష్మి పరమేశ్వరుని దివ్యసన్నిధికి జని "దేవా! నన్నిక నరకలోకానికి పంపండి" అనెను. పరమేశ్వరుడు "నీ విక నరకలోకానికి వెళ్లవలసిన ఆవశ్యకతలేదు. నీవు ఇట్టిపతిని దైవముగా భావించినావు. దైవమొకడున్న సంగతిమరచి అతను దైవమనుకున్నావు. భర్తను భార్య దైవమువలె యెంచి గౌరవించవచ్చును. కాని అతడే దైవమని తలంపకూడదు. ఇపుడు

నీవు పడిన పశ్చాత్తాపమువలన నీ దోషముపోయినది. పతి చిత్తచాంచల్యము—విషయలోలత్వము చూచి నీవుపొందిన దుఃఖము మిగిలిన పాపపంకిలమును తుడిచివైచింది. ఇక నీవు పవిత్రమైనదానవు. స్వర్గానికి వెళ్ళి ఆనందమున నుండుము. సత్యమైన ప్రేమామృతము నీవిచటమాత్రమే అనుభవించ గలవు. ఇంకెక్కడా నీకాప్రేమామృతము లభింపజాలదు. పోయి శాంతినిలయము, ఆనందనిలయము, ప్రేమనిలయము అయిన స్వర్గధామంలో వుండు." అని ఆశీర్వదించెను.

లక్ష్మి ఇప్పుడు ప్రశాంతినికేతనమగు ప్రేమానందనిలయమున సంకల్పరహితయై యున్నది.



## దిక్కులేని పక్షి:

ఒక దుర్లభాశావిదీర్ణహృదయము—నవనవలాడుచున్న లేత కాపుపడుచు, ముందఉన్న వరిచేనులకేసి, ఉదయించుచున్న కుంకుమవర్ణపు సూర్యునికేసి జాలిగొలుపు చూపులతో జూచుచు పొలముగట్టున నిలువబడియున్నది. ఆకసము మేఘ శూన్యమై విమలమై ప్రశాంతము బోధించుచున్నట్లున్నది. పిచ్చుకలు, ఇంకను రంగు రంగుల పిట్టలు కిలకిలలాడుచు ఆనందముతో నాడుకొనుచున్నవి. అప్పుడే యింకొక లోకము నుండి వచ్చుచున్న సూర్యభగవాను డెంతో ఆనందదాయకముగా కనిపించుచున్నాడు. అంతయు నానందమయముగా నున్నది. కాని ఆ కాపు పడుచు హృదయము మాత్రము దుఃఖావృతమై యున్నది. ఈ ఆనందప్రదమైన ప్రకృతి ఆమె నెంతమాత్రము ఓదార్చజాలకున్నది. అప్పుడామెకు ఉదయ సూర్యుడు దుఃఖ కారకుడైనాడు. ఎందుచేతనో ఆమెకే తెలియదు. చల్లగా వీచుచున్న పిల్లవాయువులలో నామెకు ఏవో దురంత విషాదగీతికారావములు వినిపించినవి. ఒకటిరెండు కన్నీటిబొట్టులా శుష్కదేహి కళాయుక్తమైన నయనముల నుండి జారిపడినవి. ఆ బిందువులలో ఉదయసూర్యుడు ప్రతిబింబించినాడు. ఆమె మోకరించి యెదుట కనిపించుచున్న భగవానునకు మ్రొక్కినది.

ఆమెపైనుండి ప్రకృతి సంతానమగు రెండుకాకులు "కావు కావు" అనుచు నెగిరిపోయినవి. సమీపములో నొక తెలివిగల పసులకాపరి గొంతెత్తి యిట్లు పాడుచున్నాడు.

"తల్లీ యందునా, తండ్రీ యందునా,
యెల్లర బ్రోచెడు నీశ్వరా యందునా,
ఏమని పిలుతును నిన్ను, నే నేమని పిలుతును నిన్ను"

* * * *

శుక్లపక్షము—ద్వాదశి. నదీ పులిన భాగమున దిరుగాడుచున్న ఆమె అలసట జెందిన దేహమునకు సంధ్యానిలము విశ్రాంతినిచ్చుచున్నది. తపించి తపించి యున్న ఆ లేత హృదయమునకు చల్లని చందురుడు చల్లదనమిచ్చి సేద దీర్చుచున్నాడు. మనోహరమైన ఆకసపు వింత రంగులు, నదీతరంగములలో ప్రతి బింబించి అంతకన్న అందముగనున్న చందమామ, మెత్తగనున్న యిసుకతిన్నె—ఇవన్నియు నిప్పుడామె అమాయకపు హృదయమునకు నిసుమంతయేమి, బాగుగానే ఆనందము నిచ్చుచున్నవి. ఈ సమయమున నామెకు లోకము కఠినపుదిగా కనిపించలేదు.

కాని అంతలోనే ఆమెకు తన దీనావస్థస్మృతికి వచ్చినది. ఆమె విస్మృతికుహరాంతరముననున్న విషాదమయ చారిత్రము నేదో కఠిన హస్తముపైకి దీసి విప్పి యామె కన్నులయెదుట బెట్టినది. ఆ దిక్కుమాలిన పక్షి ఒకటొకటిగా పుటలుత్రిప్పి తన గతజీవితమును మెల్లగా జదువుకొనినది.

మరల నొకటిరెండు బిందువులు కనుకొలంకులనుండి ఆమెకు తెలియకుండగనే భూమిపై బడినవి. ఆవిదీర్ణహృదయమునుండి వెడలి వచ్చిన నిట్టూర్పు గాడ్పులు అనంతమైన గాలిలో గలిసి పోయినవి.

కాపుపడుచు సొమ్మసిల్లినది.

కోకిలము మధురముగ బాడినది. కోకిలారావము ఆమె కిట్లు వినిపించినది: 'నన్నెవరు రక్షించుచున్నారు!'

*     *     *     *

కనిపించని చేయి యేదో ఆమెను ఆ యిసుక తిన్నెమీదనే నిదుర బుచ్చినది. కాపుకన్నె కలగన్నది:

బలిష్ఠమైన శరీరముగల రయితుబిడ్డ కనిపించి "అమ్మా యీ, ఎవ్వరులేని యీ నిర్మానుష్య ప్రదేశములో నీ వొక్క తెవు ఎందుకున్నావు?" ఆమెను ప్రశ్నించినాడు.

"ఏమిచేయను అన్నా! నేను దిక్కులేనిపక్షిని. నాకు తెలి యని శక్తి యేదో నన్నిట్లు త్రిప్పుచున్నది"

"నీ చరిత్ర యేమిటి చెల్లీ"

"అన్నా! నీకంత దయగలిగితే చెపుతాను విను. అయ్యో! అన్నా ఎవరికీ లేని దయ నీ కెల్లా కలిగినదీ? నా చిన్నతన ములో నా కొక తల్లీ, మాయింట్లో ఒకదాసీ ఉండేవారు. నాతల్లి నాతో చెప్పకుండగనే ప్రాణమువిడిచింది. అప్పుడు ఆ దాసీ నన్ను సంరక్షించుతూ ఉండేది. అదికూడా కొన్నా ళ్లకు చనిపోయింది. అప్పుడు నేనేమిచేయను అన్నా! దిక్కు

మాలిన పక్షినై పల్లెపల్లె తిరుగాడుతూ ఉన్నాను. నా దయనీయమైన స్థితిచూచి ఒకరూ నన్ను దయదలచినారు కాదు. ఈ తల్లిలేనిపక్షికి తల దాచుకొనడానికి రవంతచోటిచ్చి పుణ్యము కట్టుకొనడానికి వచ్చావా నా అన్నా!" అని రెండు చేతులు జాచి ఆమె లేవబోయినది.

కాపుపడుచుకు మెలకువ వచ్చినది. కనులు తెరచి చూడగా రయితుబిడ్డ కనిపించలేదు; ఇంకొక వ్యక్తి కనిపించినది. ఆమె క్రుంగి క్రుంగి యున్న హృదయము దడదడ కొట్టుకొనినది. ఆ ప్రక్కన నిలుచుండి యున్న వ్యక్తి యెవరు? వికలాంగుడైన యొకానొక యోధుడు.

ఆ వీరుడామె దగ్గర కూరుచుండి "భయపడకు" అని ఆమె కేసి నిష్పందనయనుడై చూచినాడు.

కాపుపడుచు కూడ నాతని నిశ్చలదృష్టితో పరికించి "అయ్యా, నీ వెవరవు. నన్ను రక్షించడానికి వచ్చావా?" అన్నది.

వీరుడామెను దగ్గరకు తీసికొని రెండుచేతులమధ్య నామెనిడుకొని "నీపేరేమి" అన్నాడు.

"నా పేరా?—నాగరత్నం"

"రత్నం" అని ఆమెను కౌగలించుకొన్నాడు ఆ వీరుడు.

* * * *

అతడు జేబులో నుండి యొకకాగితము దీసి ఆమె కాలేఖ జూపుచు యిట్లు చదివినాడు.

నందపురము
విజయనగరసంస్థానము
30 జనేవరి, 1565

ప్రియా!

నా శరీరములో అస్వస్థతగా నుండుచున్నది. అయినను నాకు విచారములేదు. పదునాలుగు రోజులక్రిందట కుమార్తె కలిగినది. ఈ పాపయే మన కానంద ప్రదాయినియై యుండ గలదు. పాప పేరు నాగరత్నం పెట్టదలంచినాను. మీ యుద్దేశమెట్లున్నదో వ్రాయకోరెదను. నేను, దాసి, నాగరత్నము సుఖముగనున్నాము. మీ యుద్ధమెట్లున్నదో వ్రాయకోరు చున్నాను. శ్రీ శ్రీ శ్రీ విజయనగరమహారాజులుం గారైన రామరాజుగారి సైన్యమును సుల్తాను హుస్సేను నిజాంషాగారి దండులు చల్లాచెదురు చేయుచున్నవని యిచట వినికిడి. ఈ యుత్తరము మీకు చేరునో చేరదో అనియు, మరల మనము కలియుదుమో లేదో అనియు సంశయభావమున నిది వ్రాయు చున్నాను.

ప్రేయసి భూషణం

వారిరువురు ప్రేమైక గాఢాలింగనమున చాలసేపున్నారు. చాలసేపైనను వారికా సమయమొక స్వప్న మధుర క్షణము వలె తోచినది.

సుధాకరుడు, సుధామయకాంతి, నక్షత్రములు, మారుతము, తరంగములు వారి నాశీర్వదించినవి.

# సంశ్రుత దోషము:

అపరాహ్ణసమయము— విశాఖపట్టణము. ఇస్లామియా వాస్తుశాస్త్రప్రకారము చక్కని గురుజులతో నిర్మితమైన ఆమనోహరభవనము వలపువాంఛదీర్చెడి మహమ్మదీయరమణి విశాలతరళనయనముల కోలచూపులవలెనే సౌందర్యకళలు విరజిమ్ముచున్నది. సముద్రపుటొడ్డున నుండుటచేత ఆ శ్వేత సుందరమందిరమునకు గోషావిడిచిన తుర్కీ మోహనమూర్తి వలె, నవ్యఫణితిమధురిమము ఆవరించి ఆరూపకళలో సమ్మిళితమైపోయినది. దాని మునిముంగల రెండేపొడుగుపాటి సర్వీచెట్లు, కొన్ని పూలమొక్కలు, క్రోటనుచెట్లు. భవనమధుర సౌందర్యమునకు తగినటులే నామధేయము. బంగారురంగు అక్షరములలో 'ఒమర్ కయామ్.'

టేబిలుముందఱ కుర్చీలో స్వేచ్ఛగా కూర్చుండి మనోహరముగా అలంకరించుకొనియున్న ఆమె ఒక్కొక్కప్పు డెదురుగానున్న కొబ్బరిచెట్లచాటున అస్తమించుచున్న సూర్యుని చిత్రపటమువైపు, ఒక్కొక్కప్పుడు తెరచియున్న ద్వారము నుండి బయటికి ఎదో ఆలోచించుకొనుచు చూచుచున్నది.

అటుల కాంచుచు కాంచుచునే ఆమె తనలో తాను నవ్వుకొన్నది. అప్పుడామె మెరియుచున్న కనుల వెలుతురా అది కాక కనులలో పులకరించిన చిఱునగవా? ఆగుంట్రని తెల్లని

లేతబుగ్గలలోకనిపించు చిఱుగుంటలు తెలుపుచునే యున్నవి చిఱునగవే అని. తనపలుచని కోమలశరీరమునకు నవ్యత ఆపాదించుచున్న పాలరంగుపట్టుచీర గాలితాకుడు కెగురుటచే ఆమె నాజూకుగా గులాబీరంగు వ్రేళ్లతో సరుదుకొన్నది చేలాంచలములు. పొడుగుపాటి కాటుకరంగు కురులు విరబోసి యుండుటచే అనిలతరంగములతో ఆడుకొనుచున్నవి. కుడివైపున కొన్నికురులనడుమ ముచ్చటగా ముడివేయబడియున్న ఎఱ్ఱని పట్టురిబ్బనుకూడా అలలతాకుడుకు కదలుచునే యున్నది.

అప్పుడే యెలాస్టరు గీతముచదువుట పూర్తిజేసి—కలలో కనిపించిన కన్యకోసము తిరిగితిరిగి, ఎక్కడ! ప్రకృతి నిశ్శబ్ద సమయాలలో—సౌందర్యపిపాసతీర్చుకొనుటకు, కాల్చివేయుచున్న పిపాసజ్వాలలు ఎవరు శాంతించునది, అటువంటిశక్తి యున్నవారు—ఎక్కడాఉన్నది: పిపాస, పిపాస, ఈఅంతులేని పిపాస, దయతో ఆర్చివేయుచున్న పిపాసకు—ఏదీ ఆసౌందర్యము! ఆ మాధుర్యము! ఏదీ ఆజీవనశక్తి, అమృతప్రవాహము—యిటువంటి ఆవేశము, జీవము ప్రసాదించిన షెల్లీ కవిహృదయమును దూరపులోతు చూపులతోనే, ఊర్పుగాడ్పులతోనే అభినందించుచు గదినుండి వెలుపలికి వచ్చి:

“కవీ, నీవు మాంత్రికుడవా—యిటువంటి మెరుపులు నీవు దాచివేయడానికే ప్రయత్నించివుంటే నీవెన్నహృదయాన్ని అవి చించివేయవూ! యిటువంటి గులాబీహృద

యాన్ని దిగమ్రింగి తేనేగాని ఆక్రూరపు యిటలీనీళ్లకు కడుపు మంట చల్లారిందికాదూ!" తనలో తానే అనుకొన్నాడు రాధారమణ.

రమణ యిరువదేనిమిది వత్సరముల ప్రాయమువాడు. చామనచాయ, పుష్టిగలశరీరము. నొక్కులు నొక్కులుగా మెరయుచున్న నల్లని క్రాపింగు.

ఆమెవంక చూచినా డతడు. ఒడలు పులకరించి పోయినది. రక్తముష్ణమై ఆవేశము నందినది. అతని కెప్పటికప్పు డామెలో నవనవానందము, నవ్యసౌందర్యము, క్రొత్తజీవము, క్రొత్తకళ గోచరించుచునేయుండును. ఎప్పు డామె సహచర్యమున జీవము అనుమాత్రము తగ్గినట్లు అనుమానము కలుగునో ఆతడు వెంటనే మెలకువకలిగి తెలివితేటలుతో ఎడబాటు బలముతో నిర్వీరిజీవితములు రసవత్తరజీవవంతములు చేసికొనుచుండును. అదియే అతనిలో 'గొప్ప' అందురతని స్నేహితులు.

రెండుగంటల యెడబాటుతో అతని చూపులు ఆవేశ గర్భితములైనవి. ఉబుకుచున్న ఆవేశము నాతడు పదిలముగా అణచుకొని మెల్లగా నడుగులిడుచు వెళ్లి చటాలున ఆమె కనులు మూసినాడతడు.

ఆమెనవ్వినది నెలబాలుని వెన్నెలలాగు. చిఱుగుంటలు బుగ్గలమీద, ఎంత ముచ్చటగా ఉన్నవీ!

రమణ చూచినాడు వానిని. హృదయ మొక్కగంతువేసి నది, చిఱుగుంటలునుండి వెలువడిన విద్యుత్తరంగముల స్పర్శతో.

"వివియానీ—" అన్నాడతడు ప్రేయసిని ముద్దు పేరుతో.

"ఎవరుమీారు! షెల్లీ— పట్టుపడ్డారులెండి, యింకెందుకూ"

రమణయేమీా మాటాడకుండా ఆమెను అటులనే సోఫా దగ్గరకు తీసికొనివెళ్లి అందుకూర్చుండజేసి వెనుకకు కొంచెము వంచి చటుక్కున చేతులు తీసివైచి గుండ్రని అంసద్వయము పట్టుకొని:

"పట్టుపడినందుకు బహుమతీ యేమిస్తావు, వివీ!" అన్నాడు.

"ఏమివ్వమంటారో చెప్పండి" అన్నది వివియానీ నవ్వు ఆపుజేసికొని.

"బహుమతీ యిదివ్వమని చెపుతారాయేమి టెక్కడన్నా, ఊఁ, అల్లాఅయితే నేనొప్పుకోను" అన్నాడు రమణ గారాముపెట్టుచున్న బాలకుని కంఠముతో.

"వొప్పుకోపోతే నేనేమిచేస్తా, నేనూ వొప్పుకోనూ, అప్పుడేమిచేస్తారూ?"

"ఊఁ, అదేమిటి! అల్లా యెల్లాకుదురుతుంది! నన్ను పాపాయినిచేసి ఆడిస్తున్నావు."

"అవును, మీరేపాపాయి—(ముద్దుగా) పాపా! కూచీ, నీకు బహుమతీ యేమికావాలమ్మా" అని నవ్వినది వివియానీ.

"నాకవి కావాలి, యెల్లాయిస్తావో యియ్యిచూద్దాము" అన్నాడు రమణ బుగ్గమీది చిఱుగుంటలు చూపి "అదేమిటమ్మా, అల్లా అడుగుతారా యేమిటి యెక్కడన్నా! సంతోషంకొలదీ యిచ్చేవాళ్లు తమ మనసొచ్చిందిస్తారుకాని"

"పోనీ, నీయిష్టమొచ్చిందియ్యి"

"నాకసారి అడిగేసిన తర్వాత యింకా నాయిష్టమేమిటి. మీరడిగిందే యిస్తాను. తీసుకోండి, యెక్కడున్నవో అక్కణ్ణించే"

రమణ యిక పట్టలేకపోయినాడు ఉత్తుంగతరంగములలాగు వెల్లువయై యుబుకుచున్న ఆవేశము. దక్షిణహస్తముతో ఆమెను గట్టిగా ఎదురుగా దగ్గరకు తీసికొని యెదురొమ్ము కదిమివేసికొని తన యినుపకౌగిలిలో, గులాబీపువ్వువంటి వంపులుతీరిన చిన్నిపెదవులను మనసార, కసిదీర తన్నుతానే మరిచిపోయి ముద్దిడినాడు. ఆమె తన రెండు లేతహస్తాలతో రమణను ఉద్రేకముతో తన యురమున కదుముకొన్నది అర్ధనిమీలితనయనములతో అతనివంక చూచుచు.

కుడిచేయి ఆమె గుండ్రని కోమలమైన మెడచుట్టూ వేసి, యెడమచేయి ఆమె వక్షస్థలముపైనుంచి రమణ ఆమెను తన ప్రక్కకు దగ్గరగా తీసికొన్నాడు. ఈసారి ఆమె అతనినడుము

చుట్టివైచిన దొకచేతితో. ఆవేశముతో సున్నితముగా ఆమె కంఠసీమ కౌగిలించుకొని శిరస్సు నామె గుండ్రని భుజముపై ఒక నిమిషముంచి పీల్చివేయుచున్న తృష్ణ, అంతులేని పిపాసతో బంతిపువ్వులాగు మనోహరముగానున్న మెడ ముద్దు పెట్టుకొన్నాడు అతడు. వక్షముపై చేయి — పిల్లగాడ్పుల కదిలిన అలలువలె నెగురుచున్న ఆమె వక్షముతోపాటు, అచటనున్న రమణచేయికూడ కదలుచున్నది. రమణ చూచినాడు. నాజూకుగా చేయి వక్షముపై చరచుచు, మెడచుట్టియున్న రెండవచేతి బొటనచూపుడువ్రేళ్లు చిఱునగవుచే ఏర్పడిన చిరుగుంటలపైనుంచి ఆమె కన్నులలోనికి ప్రేమ తీవ్రతతో చూచినాడు రమణ. ఒక నిమిషము. మరల ఉద్రేకము. ఈసారి శక్తికొలది ఆమె పూవువంటి మెత్తని పలుచని శరీరము తన యినుపకౌగిలిలో ఎన్నోసారు లదుముకొన్నాడు. వివియానీ కూడ ఆతనిని తన లేతకౌగిలిలో కసిదీరా అణిచివేసినది. రమణ ఆమెను నలిపివేసినాడు. అమె ఆతనిని కలచివేసినది. తన్మయులైపోయి—పిపాస, సౌందర్యపిపాస—ఎట్లు తీరగలదు? ఆనందించినా రొకరినొకరు. అనుభవించినా రొకరినొకరు. తృప్తియేదీ—ఆమె పలుచని లేతహస్తాలతో తీగెలాగు చుట్టివేసినది అతనిని. అతడామెను తనపుష్టిగల బలమైన చేతులతో దగ్గరగా నొక్కినాడు. ఏమేమోకబుర్లు చెప్పుకొన్నారు. ఏమేమో మాటాడినారు ఒకరి చూపులో ఒకరు, ఒకరి సౌందర్యములో ఒకరు ఐక్యమైపోయి.

అతనికి దక్షిణపార్శ్వమునను్న వివియానీ మృదులకంఠ సీమజుట్టి యాతనిహస్తము, ఆతని నడుమునుచుట్టి ఆమె మంజుల హస్తము అటులనే యున్నవి.

టీ వేళయినది. సేవకుడు టీ తీసికొనివచ్చి వారిముం దునిచి వెళ్లినాడు. చిఱునగవుతో నామె రమణనోటి కందించినది పాత్ర. ఆతడు కొంచెముత్రాగి మరల ఆమె వదనము ముం దుంచినాడతడు కంఠమును జుట్టియున్న చేతితోడనే. ఇటులనే మెల్లగా చాలసేపు ఉప్పొంగిపోవుచున్న హృదయములతో, విచ్చియున్న చిత్తములతో, పులకరించియున్న అంగములతో త్రావినారిద్దరును.

తర్వాత ఆమె సిగరెట్టు అతని నోటిలోనుంచి తానే వెలిగించినది. అతడు కొంచెము కొంచెము తియ్యని పొగ విడుచుచు ఆమె మెరుపుకన్నుల ప్రకాశములోనికి చూచుచు, ఆమెను నవ్వించుచు నవ్వినప్పుడు కలిగిన చిరుగుంటలు రెండు వ్రేళ్లతో సున్నితముగా నొక్కి ఆనందించుచు, కురులు యెదో తనకు తెలియని పద్ధతిని సవరించుచు ముంగురులు మోముపైకి తీయుచు మరల వానిని చిక్కుచేయుచు, శిరోభాగము, నెన్నుదురు ముద్దిడుచు, ఆమె శిరస్సు తన భుజముపై నాన్చుకొనుచు ఆమె ముద్దులందుకొనుచు—కొంతసేపు వెళ్లబుచ్చినారు.

రమణ చటాలున లేచివెళ్లి తనగదినుండి ఉడుకులాన్ సీసా తీసికొనివచ్చి వివియానీ తొడపై శిరస్సునుంచి పరుండి పరి

మళ్ళోదకము ఆమెపై కొంత చిలుకరించినాడు. ఆమె సీసా తీసికొని ఆతనిపై కొంత జల్లినది. అతడామె బంతిపువ్వువంటి గుండ్రని చిన్ని చుబుకమును పట్టుకొని:

"విపీ, మనము కలకత్తాబొటానికల్ గార్డెన్సులో గడిపిన రాత్రి జ్ఞాపకముందా"

"ఆఁ, ఎందుకు జ్ఞాపకముండదూ. అటువంటి కఠినపరీక్ష మరిచిపోవడమే యింకా యేమన్నావుందా"

"ఆపరీక్షలో తప్పవలసింది నువ్వు, ఏమిచేసేవాణ్ణో తెలిసేది"

"మీరే తప్పడము తటస్థించితేనా యేమిచేసేదాన్నో తెలుసా"

"ఆఁ నాకు తెలుసు—ఒకచిన్ని బుగ్గపోటని"

"అవునుకాని యేమండీ అటువంటి పరీక్ష లెవ్వరైనా చేస్తూవుంటారూ!"

"ఎవరో జోలి మనకెందుకు పోనిస్తూ, నేను పెట్టినపరీక్ష బాగుందా లేదా!"

"ఏమి చెప్పమంటారూ?"

"అదుగో—"

"యిప్పుడు నన్ను మీరేమి చేయగలరేమిటి? పరీక్ష ప్యాసయిపోయినానుగా—యింకేమిచేస్తారు?"

"అవునుకాని విపీ, ప్లాను బాగాతోచింది మొత్తానికీ. ఆరాత్రి మనము గార్డెన్సుషికారు వెళ్లడమూ, అక్కడికి

వెళ్లాక ప్రేమపరీక్ష ఒకానొకరు చేసుకోవాలని మనయిద్దరికీ ఒక్కసారి తోచడమూ, సరే యేమిచేద్దామంటే యేమిచేద్దా మనుకోవడమూ, ఆరాత్రంతా మనమిద్దరమూ రెప్పవాల్చ కుండా సూర్యోదయమువరకూ మేలుకోవడమూ యిందులో యెవరు రెప్పవాల్చితే ఆవ్యక్తి హృదయపాత్రలో ప్రేమ రసము అంచులువరకూ తొణుకుతూ నిండా లేదనీ అందుకు అసంపూర్ణప్రణయానికి శిక్షగా ప్రేమరసము అంచులువరకూ నిండటానికి యెడబాటు మంచి మందు గనుక నెలరోజు లొకరికొకరు కనిపించకూడ దనీ, వోడిపోయిన మనిషి గెలి చిన మనిషికి ఉత్తరములు వ్రాయవచ్చు కాని, గెలిచినమనిషి వోడిపోయిన మనిషికి వుత్తరాలు వ్రాయకూడదనీ, యిద్ద రమూ పరీక్షలో గెలిపొందితే—అంటే మనమిద్దరమూ ఒకరి నొకరు ఇసుమంతకూడా తక్కువలేకుండా ప్రేమిస్తున్నామనీ మనయిద్దరి హృదయపాత్రల్లో ప్రేమరసము అంచులువరకు తొణుకుతూవుందనీ గెలుపుసూచన: దీనికంతటికీ పౌర్ణమి చంద్రుడు సాక్షి. గెలిస్తే సంతోషప్రకటన మిత్రులందరికీ కారణము చెప్పకుండా పెద్దవిందు చేయడము. బలేపరీక్ష, విపీ! ఆవిందుకు కారణము తెలియక ఆరోజు వాళ్లెంత అను మానపడ్డారూ, చివరి కేమనుకున్నారో వాళ్లంతా."

"ఒకామె మాత్రము బహుచక్కగా అనుమానపడింది. చెప్పాగా మీకు, గర్భిణివచ్చిందేమో అంచేత చేస్తున్నారని అనుకుంది పాపమావిడ."

రమణ ఆమెమోము తనముఖము దగ్గరకు తీసికొన్నాడు. ఆమె అతనిని ముద్దుపెట్టుకొన్నది. చేయి అటులనే కంఠము చుట్టునుంచి మోము దగ్గరగా నుండగానే,

"విపీ, నువ్వు నాదానివయిపోయినా కూడా యీవిధంగా తృష్ణతీర్చుకుంటూవున్నా కూడా యేమిటో రోజురోజుకీ పెరిగి పోతూంది తృష్ణలోతు రోజురోజుకీ గంటగంటకీ పెరిగి పోతూంది తృష్ణవైశాల్యం. ఒక్కొక్కప్పు డనుకుంటా యెల్లా నావిపీకి నాచిట్టికి హృదయం విప్పి—అబ్బా యేమే మిటో చేద్దామనుకుంటా విపీ! విప్, యెల్లాపెంచుతావు యీప్రేమ—యెక్కడుంది ఈశక్తంతా విపీ నీకు" అని మరల రేకెత్తిన ఉద్రేకముతో ముద్దిడినాడు రమణ.

ఆమె మృదులహృదయము పులకరించిపోయినది. చలించి నదికూడా ఆమాటల తీవ్రతవల్ల. కనులు పెద్దవిచేసి, వెంటనే చిన్నవిచేసివైచి అతని హృదయమునకు మోకరించి నమస్క రించుచున్నవా యన్నట్లు చూపులతో:

"ఒక్కొక్కప్పుడు నాకు భయమువేస్తూ వుంటుందండి తలుచుకుంటే. అంత తీవ్రం, అంతలోతూ, అంతగభీరత, అంత చక్కదనం వున్నప్రేమకు ప్రతిరూపుగా అటువంటిదే మళ్ళా అర్పించుతున్నానా లేదా, అని అనిపిస్తూ వుంటుంది. అప్పుడు భయంవేస్తుంది మరేమైనా అనుకోండి: ఎప్పుడైనా తెలివి తక్కువచేత అటువంటి ధనం చెయిజారకొట్టుకుంటానేమో అని—అప్పుడొళ్ళు వణికిపోతుంది" ఆమె అన్నది.

రమణ ఆదరముతో ఆమెను దగ్గరగా ఒత్తుకొన్నాడు.

"వివీ, నువ్వు అల్లా అనుకుంటున్నావా! నే నేమనుకుం టున్నానో తెలుసా! వివి అంతటి రూపరాశి: తానేకాదు, తనహృదయం, తనప్రేమ, తన సర్వస్వమూ నాకే అర్పించి వేశేశింది. అంతకన్నా యేమికావాలి—నేనొక్కణ్ణే ఈప్రపం చంలో ధన్యుణ్ణి ధన్యుణ్ణి—"

"ఊఁ"

ఒక నిమిషమాగి

"అచ్చంగా అల్లాగే నేనూ అనుకుంటూవుంటానండీ. అదే ఆభయాన్ని అప్పుడప్పుడూ అణిచివేసి వోదారుస్తూ వుంటుంది. అప్పుడెంతో వుప్పొంగిపోతుంది మనసు. నాఅంత అదృష్టవంతురాలుండా అటువంటివారు తమకున్నదంతా హృదయం ప్రేమా అంతా నాపై నిలిపివేశేశారు చలనము లేకుండా. ఎంతగర్వం, నేనేకదా నాసౌందర్యమేకదా అల్లా ఆకర్షించకలిగింది అనీ."

అతడామె నింకా దగ్గిరగా అదిమికొని:

"వివీ, జన్మలంటే నాకు నమ్మకంలేదు కాని వొక్కొ క్కప్పుడు మాత్రం—మనయిద్దరికీ పూర్వజన్మంలో యెదో విచిత్రమైన సంబంధం వుండివుంటుం దనిపిస్తుంది వివీ."

"అదేమో నాకు తెలియదుకాని, మీరు నాకోసం, నేను మీకోసం యీవిధంగా పుట్టామని మాత్రం నాకు తెలుసు— జరిగిపోయిందానిజోలి జరగబోయేదానిజోలి మనకెందుకు?

యెప్పటికప్పుడు ఆనిమిషం ఆనందంతో మనమిద్దరమూ అనుభవించడమే మనపని ”

“ ఊఁ, అల్లాగే ” అని రమణ ఆమెను మండిపోవుచున్న ఉద్రేకజ్వాలతో ముద్దుపెట్టుకొన్నాడు.

“ అవునుకాని యేమండీ, యిన్నికబుర్లు చెపుతానా వొకొక్కప్పుడు యింత passionate గాను రసవంతంగాను గడిపే జీవితం—మనయిద్దరినడమా బంధం, ప్రేమ మామూలే అయిపోయి నీరసంగాను పేలవంగాను అయిపోతుందేమో కొన్నాళ్లయిపోయాక అనిపిస్తూ వుంటుంది. ”

“ ఏపీ, నీకన్నీ సందేహాలే. మన పెళ్లిఅయి నాలుగుసంవత్సరాలయినాయి, యేమంత తగ్గిందేమిటి మనబంధం యొక్క పురీ! మనజీవితంలో యేమితగ్గిందీ, సౌందర్యమా, మాధుర్యమా, ఆనందమా? ఈ జీవితం యెప్పుడూ యీ పసతో గడిచిపోవలసిందే ”

“ అవునులెండి నాకు తెలుసు—అవునుకాని అల్లాఅంటారు సంతానముతో కొందరి జీవితాల్లో ఆనందము పట్టు తప్పడము మనం చూడడములా ”

“ ఏపీ, నిజమైన ప్రేమవున్నచోట యేదీతగ్గదు, యెన్ని అవాంతరాలొచ్చినా. కాకపోతే వొకటుంది. మనవాళ్లు తెలివితక్కువచేత ప్రేమను పెంచుకోవడము చేతకాక ఆవిణ్ణి వంటమరచేసివేసో, దాసీదాన్ని చేసివేసో, లేకపోతే యెక్కువ మోహంవల్ల వొకరినొకరు విడవకుండా క్రొత్తకాస్తా గడవ

డముతోనే యెడమొగం పెడమొగం చేసుకునో—యింకా యిటువంటి కారణా లనేకము వున్నాయి, యీ విధంగా చక్కని గులాబిపువ్వులాంటి జీవితం శ్మశానం చేసుకుంటారు. వొకరినొకరు అనుభవించడము చేతకాక. పురుషుడి ఆనందము కోసం స్త్రీ, స్త్రీ ఆనందముకోసం పురుషుడు సృష్టింపబడ్డా రన్నమాటే మరిచిపోయినట్టు కనిపిస్తుం దీలోకం మైమరిచి. విపీ మొన్న మనం సముద్ర యొడ్డున కూర్చున్నప్పుడు చెప్పలా! ప్రేమ వొక గొప్పకళ. దాన్ని పెంచితే పెరుగు తుంది; నిర్లక్ష్యంచేస్తే చచ్చిపోతుంది. ఈ ప్రేమకళామర్మం తెలిసికోకుండా, రాత్రుల్లు మాత్రమే వుక్కబోస్తున్న గదు ల్లోనూ, తెరలుచాటున కలిసేవాళ్ల జీవితాలు శ్మశానాలు కాకుండా దేవేంద్రుని తోటకావాలంటే యెల్లా అవుతుంది. ప్రేమను భద్రపరచుకొని, ప్రాణపదంగా వుపయోగిస్తూ—నిరు పయోగం చేయకుండా వుప్పునీళ్ళనుకొని—ప్రేమకళాజ్ఞానం సాయంతో ప్రేమ పెంచుకుంటూ యెడబాటు సాయంతో దానికి యెరువు వేస్తూ యెంతో మెలకువగా వుంటే తప్ప లేక పోతే పన్నీరువంటి ప్రేమలోని ఆనందం కుళ్లి కంపు వేస్తుంది కూడాను. మనం చూడడములా కొందరి జీవితాల్లో; చదువుకున్న వాళ్ళుకూడా అటువంటి కుళ్లికంపు వేస్తున్న జీవి తాలు గడుపుతూవుంటే జాలివేస్తుంది. వాళ్ళకన్నా పొలాల్లో పనిచేసుకునే కూలిదంపతులు నయం—విపీ యింతే, ప్రేమను పెంచి రెట్టింపు వుత్సాహంతో అనుభవించేట్టు చేయడానికి

యెడబాటుతప్ప దాని కింకో యెరువులేదు—యేమిటి వివీ, కళారహస్యం తెలిసినదానివి నువ్వుకూడా అనుమానపడుతూ వుంటావు.” అని రమణ ఆమె మెరియుచున్న తరళనయనములు చుంబనముగొన్నాడు.

ఆమె మధురముగ నవ్వుచు సన్ననికంఠమున మెల్లగా “అందుచేతేకామాను మహానుభావులు మీరు. యీ ‘యెడబాటు’ మాటని కార్యరూపంగా వుంచి మనసు కలతపెడుతూ వుంటారు!” అన్నది.

అతడు ప్రత్యుత్తరముగా నవ్వినాడు సంతోషముతో.

తర్వాత టేబిలు కిరుకెలంకుల నిర్వురు గూరుచుండి చతురంగము ప్రారంభము చేసినారు. లోతుగా ఆలోచించుచు ఒకొక్కప్పుడు నవ్వుకొనుచు, మఱొకప్పుడు తెచ్చుకొన్న కోపముతో నిర్వురు నుత్సాహముతో నాడుచున్నారు. నడుమ నడుమ యెవో కబుర్లు.

“అయిదవ్వొస్తూంది. వేణుగోపాల్ వచ్చే వేళయినట్టుంది” అన్నది ఆమె.

“ఈ గోపాల్ యెక్కడ దొరకాడు వివీ, నీకు” అన్నాడతడు.

“బాగావుందండీ, చిన్నప్పు డెంత స్నేహంగా వుండేవాళ్ళమనుకున్నా రేమిటి!”

“యెల్లావుంటాడతను నే నెప్పుడూ చూడనేలేదు.”

ఆలోచనలో పడినదాతని మనస్సు.

"చిన్నప్పుడు చాలా బాగుండేవాడు, యిప్పుడెల్లా వున్నాడో తెలీదుగాని యీమధ్య యింగ్లండు వెళ్లాడని చెప్పాగా? యింగ్లండు వెళ్లినవాళ్లకి క్రొత్తఅందము వస్తుందండీ! అయినా నేను చూసి చాలారోజు లయింది."

"ఊఁ—కానియి వుపన్యాసం."

"చిన్నప్పటిరోజులు జ్ఞాపకమొస్తే యెల్లావుంటుం దనుకున్నారూ! ఒక్కసారి అమాంతంగా చిన్నపిల్లనైపోయి ఆడుకోవాలనిపిస్తుంది."

"తరువాత, తరువాత" అన్నాడు రమణ నవ్వుచు.

"గోపాల్ చిన్నప్పు డెంత అందంగా వుండేవా డనుకున్నారు—అదుగో నవ్వుతున్నారు, అయితే నేను చెప్పను."

"లేదు, లేదు విపీ, చెప్పు వింటాను" అన్నా డతడు ఆమె చుబుకము పట్టుకొని.

"మల్లిపువ్వంత తెల్లగా వుంటాడండీ. గుండ్రని మొగం. అదేమొగాని ఆడవాళ్ళ అందము నాకు బాగా తెలీదు కాని గోపాల్‌లో ఆడరూపు చూసినప్పుడు మాత్రం ముచ్చటగా వుండేది. అంతా ఆడవాళ్ళలాగు సన్నని కంఠమూ, మెత్తని మనస్సు, నాజూకుదనమూ, మొగంలో స్త్రీరూపం—యివన్నీ అందరిలోనూ కనిపించవండీ. అదేమిటోగానీ మొగవాళ్ళలో యినుమంత స్త్రీరూపమూ, ఆడవాళ్ళలో కొంచెం అనుమాత్రం పురుషరూపమూ క్రొత్తఅందం తెచ్చి పెడుతుందండీ"

"మరి నీలో ఆరూపులేదే?"

"మీలో వుందికనకా నాలో వుండటానికీ! యిద్దరం వొక్కటేగా, అందుచేత మీరు నాలోనూ, నేను మీలోనూ వుండి అది పూర్తిచేశామన్నమాట—మరిచెప్పేది పూర్తి చేయనీయండి! అతను నాచెల్లెలైపోతే బాగుండుననిపించేది, మనస్ఫూర్తిగా. ఆకోరిక పట్టలేక వొకరోజు యేమి చేశానను కొన్నారేమిటి! అప్పుడు మాయిద్దరికీ యెనిమిదేళ్ళుంటయి. నాకొక చిన్నపట్టుచీర వుండేదిలెండి. అతనికి నచ్చజెప్పి మెల్లగా చాక్లెట్లు పెడతానని, చీరకట్టాను. మరి క్రాఫింగు అడ్డువచ్చిందిగా వయస్సు యెనిమిదైనా బెంగాలీల మాదిరి ముసుగువేశా. గబగబా అద్దందగ్గిరికి తీసికెళ్లి నిలువటద్దం ముందు నిలుచోబెట్టి ప్రతిబింబం చూస్తే యెంతముచ్చటగా వుందనుకొన్నారు. తిన్నంగా అతనివంక చూసేదానికన్న అద్దంలో రూపుచూస్తే యెంతో ముద్దొచ్చింది. అప్పుడంత సరదాపడ్డానా, మళ్లా అంతేవయస్సులో అందంగావున్న ఆడపిల్లను చూస్తే అంత యిష్టమయ్యేదికాదు." కృత్రిమ మేమియులేక ఆ అమాయికపుహృదయ మనస్సులో నున్న దంతయు కలుషహృదయవలె దాచుకొనక మనసువిప్పి చెప్పివైచినది. అందుకాతడెంతయో సంతోషించినాడు.

అప్పుడే వచ్చినాడు వేణుగోపాల్. దరహాసితవదనముతో, మృదుమంజుల రావముతో ఆమె, గోపాల్ ఒకరికొకరు

నమస్కారము చేసికొనిన పిదప ఆమె గోపాల్‌ను పతికిట్లు పరిచయము చేసినది.

"యితను వేణుగోపాల్. మేము చిన్నప్పుడెంతో స్నేహంగా వుండేవాళ్ళము"

తరువాత :

"ఈయన్ని అందరూ రాధారమణ అంటారు; నేను మాత్రం షెల్లీ అంటూవుంటాను—యింకేమి చెప్పను (తన్ను చూపించుకొని) యీామె ప్రతిరూపు ఆయన, ఆయన ప్రతిరూపు యీామె."

అందరు నవ్వినారు. రమణకూడా కష్టముతో నవ్వినాడు. ఏదో తనకు తెలియనిది అప్పుడే ఆతని హృదయము నాతనికి తెలియకుండగనే ఆవరించుచున్నది. మెల్లగా అన్నాడిట్లులు:

"యెప్పుడొచ్చారు మీారు?"

"మధ్యాహ్నం మెయిలులో వచ్చాను. సిసిల్ హోటలులో బసచేశాను. మొన్న సుబ్బులు తల్లిగారిని చూడడానికి వెళితే మీారు చల్లగాలి కిక్కడికి వచ్చారనీ, కలకత్తా యెల్లాగూ వెళుతున్నాను గనుక విశాఖపట్టణంలో దిగి సుబ్బుల్ని మిమ్మల్ని చూశి వెళ్ళమనీ చెప్పారామె"

"సుబ్బులుపేరు తీసివేశామండీ. క్రొత్తపేరుతో పిలవాలి యిప్పుడు మీారు, 'వివియానీ' అని"

వేణుగోపాల్‌కు షెల్లీప్రణీతమైన Epipsychidion గీతా రచనకు కారకురాలైన నిరుపమసౌందర్యరాశియగు యిటలీ

రమణి మెరపువలె స్మృతికి దోచినది కాబోలు, అతడు నవ్వి నాడు.

తరువాత రమణ యేమియు మాటాడలేదు. అటులనే మాటాడక మౌనివలె కూర్చున్నా డతడు కొంతసేపు.

వివియానీ, గోపాల్ యేవేవో చిననాటి సంగతులు మాటాడుకొనుచు, వానిలో నవ్వులలో మునిగిపోయినారు.

రమణ హృదయాంతరమున సన్నని నీలితెర పడినది; అ దొకవిధమైన చిడిముడిపాటుతో వారిసెలవు గైకొనకుండ గనే అతడు లేచి వెళ్లిపోయినాడు చటాలున.

అది నిశితబుద్ధియైన వేణుగోపాల్ కనిపెట్టకపోలేదు. కాని మంచువంటి స్వచ్ఛమైన లేతహృదయముగల ఆమె చిననాటి మిత్రుని సమ్ముఖమున ఆనందపారవశ్యమున దానిని తెలిసి కొనలేకపోయినది.

రమణ హృదయమున కలిగిన యుత్తలపాటునకు కార ణము, ఈర్ష్యయో, అసహనమో, అనుమానమో అతనికే తెలియదు. అదేమైనను తనకు తెలియకుండగనే హృదయ మును కలచివేయుచున్నదది. వారిర్వురు నట్లు లానందతన్మ యులై సంభాషించుకొనుచుండ తాను ఖిన్నుడై కలకబాఱిన మనస్సుతో చిడిముడిపాటుతో చటాలున లేచివచ్చుటలోని నిగూఢార్థ మాతనికి బోధపడలే దప్పుడు. అట్టుల వారి యను మతిలేకుండ లేచి వచ్చివేయుట మర్యాదకు భంగమనిమాత్ర మాతడు మరు నిముసముననే గ్రహించినాడు.

నిశ్శబ్దముగ వెన్నరంగుపట్టు సూట్ వేసికొని, సిగరెట్టు వెలిగించి బయలుదేరినాడు షికారుకి అతడు. తిన్నగా ఎక్కడను ఆగకుండా కాళ్ళు దిగబడిపోవుచున్న మెత్తని దూది వంటి యిసుకలో సముద్రతరంగముల దగ్గరగా బిగువుగా నడచుచు డాల్ఫిన్సు నోసువరకు వచ్చి అచటి శిలాఖండముల మీద కూలబడినాడు రమణ. ఇంతవరకు నాతని హృదయము శూన్యతలముగనే యున్నది.

రెండు నిముసములు గడిచినవి. ఆయెత్తైన పర్వతముకేసి, యెగిరియెగిరి మెరియుచు నురుగుతో వచ్చుచున్న ఆకసపు రంగు తరంగములకేసి, దృష్టి వెళ్ళినంతదనుక అనంతవిశాల మైన సముద్రముమీదుగా ఉత్తేజితభావసిక్తములైన చూపుల తోడనే గాంచినాడొక్క దీర్ఘనిశ్వాసము విడిచి అతడు.

హృదయమున చలనము విజృంభించినది. ఎదుటనున్న నుత్తుంగతరంగములవలెనే వెల్లువలై నొకదానిని తరుముకొని యొకటి పరుగెత్తినవి ఆలోచనావీచికలు అపుడపుడే శాంతి నందుచున్న శూన్యతలమున : "ఎందు కీ కలత ?—"

రమణ ఆలోచించినాడు తీవ్రమైన చూపులు లోనజొనిచి. మరల నిర్మలముగానుండికూడ మనస్సున కావేశమును కలిగించుచున్న ఆకాశమువంక దృష్టి సారించినాడు :

"ఎందు కీ కలత ?—" ఆమె అంతసంతోషంగా వుండడ మేమిటి ? నాకీ కలకపాటు యెందుకూ ? వాళ్ళిద్దరితో చెప్పకుండా వచ్చివేసినందుకు యేమనుకుంటారో, మర్యాద

తెలియదని. అయినా యిదంతా యెందుకు, మనస్సుకీ చిడి ముడిపాటు, చీకటి, ఆరాటమూను.

ఆమె అతనితో అంతచనవుగా మాటాడుతుందనా? మాటాడితే యేమి—లేకపోతే అతను ఆమెతో యెందుకు మాటాడాలి అనా? యేమిటీ తుపాను...

ఏమీా తోచడములేదు. ఎందుకుమరి నే నీహడావుడిగా కలతపడిన మనస్సుతో వాళ్లతో చెప్పకుండా నైనా లేచి రావడమూ! ఆమె గోపాల్‌తో మాటాడడము తప్పనా లేక అతను విపీతో మాటాడకూడ దనా......విపీ అతన్ని అంత పొగిడింది, ఆతని అందాన్ని, నాజూకుదనాన్ని, అటువంటివాని తో విపీ యెందుకు మాటాడడమనా......విపీ అతన్ని పొగుడుతూ చిన్నప్పటికబుర్లు చెపితే యిప్పుడేగా సంతోషించా. మళ్లీ యింతలో యీకలత యెందుకూ......అతను, అంత అందమైనమనిషి, అంత ఆకర్షనీయమైన మనిషి విపీతో మాటాడితే ఆమె మనస్సు తనవైపు తిప్పివేసుకుంటాడనా. లేకపోతే సౌందర్యరాశియైన నా విపీతో మాటాడి ఆమె స్నేహము ఆనందిస్తూ అటువంటి నావిపీ నిరుపమానమైన అందము చూస్తున్నాడనా?—ఛీ! ఏమిటీ పిచ్చిఆలోచనలు.

మొత్తానికి స్త్రీలవిషయమై సంకుచితముగాను, క్రూరముగాను, నీచముగాను ప్రవర్తించే హిందూకుటుంబములో పుట్టినందుకు దానియొక్క బలం చూపించక పోవడములా, బ్రాహ్మసమాజమువంటి విశాలభావాలు మెరుస్తూవున్న

మతం స్వీకరించినా, ఆఉత్కృష్టమతం యొక్క అదర్శాలు పూర్తిగా కోరి తృప్తిదీరా హృదయములో జీర్ణము చేసుకున్నా. దయానంద, వివేకానంద, కేశవబాబు—యిటువంటి మహాపురుషుల జీవితాలు, అమృతగుళికలవంటి మహాగ్రంథాలు పఠించినా కూడా యింకా యిట్టి సంకుచితమే. అంతదాకాయెందుకు పూర్వుల్లోమాత్రం లేరూ, స్వేచ్ఛామూర్తులు! సత్యభామ, దమయంతి, సావిత్రి, ద్రౌపది, రాధ—వీళ్లందరినీ హృదయంలో యెక్కించివేసి వీరికి అగ్రస్థానమిచ్చి మననము చేస్తూవుంటానే—అయితేమాత్రమేం అదంతా గడిచిపోయిన కలలాగా అయిపోయిందికామాను యింకోయుగం వృత్తాంతము కావడముచేత. అయినా యీ యుగంలో చుక్కాని మారిపోయిందిగా, మొత్తానికి యీ పాడుశరీరములో ప్రవహిస్తూవున్న యీ యుగపుపెద్దల జీవంలేని—జీవంలేకపోతే పోనీ, క్రూరమైన, నీచమైన, బురదవంటి రక్తం తనప్రతిభ చూపించుకొంది. అందుకే యీ వెర్రి అసహనమూ, ఈర్ష్య, కలత పవిత్రమైన భార్య యింకొక పురుషుడితో మాటాడుతుంటే. లేకపోతే యేమిటి యీపిచ్చితనం—ఆమె అతనికి కనిపించకూడదనా అతను ఆమెకు కనిపించకూడదనా చిన్నప్పటి స్నేహితులైనాకూడా!

అయినా యీఅసహనమంత మహాఘోరమైన పాపం, శిక్ష యింకొకటిలేదు. అసహనానికి శిక్ష వెంటనే జరిగిపోతూవుంది—కలత, చీకటి, విచారము. ఇంతవరకూ ఆమెతో

అంతచనువుగా, ప్రేమగా మాట్లాడి, ఆమెకూడా అంత నిష్కల్మషంగా ప్రేమనిధిలాగా మనసువిప్పిచూపితే చూచి, వొకరికొకరము హృదయాలు విప్పిచూపుకుంటూ, వొకరి హృదయపాత్రలో ప్రేమామృతం యింకొకరము సంతోష ముతో తృప్తితీరా త్రాగి స్వర్గీయానందము అనుభవిస్తూ, ఒక్కహృదయం, ఒక్కఆత్మ అయిపోయికూడా యింత ఘోరమా నేను చేసేది? యింతకన్నా ఘోరమైన పాప ముందా సమస్తము నాకు అర్పించివేసి మహాత్యాగశీల, ప్రణయశీల అయిన వివి యింకొకపురుషునితో మాటాడినంత మాత్రాన అసహనమా, ఈర్ష్యయా, ఉత్తలపాటా, చిడి ముడిపాటా! యెందుకిదంతా తెలిపితక్కువ, అజ్ఞానంకాక పోతే.

వడిగా పరుగులెత్తుచున్న రక్తము విచ్చియున్న అర్ద్రి హృది, అనంతమధురసుందర భావప్రకాశితములైన తరళనేత్ర ములు——చూచినాడు మరల నింకొకసారి అనంతమైన ఆకా శము, సువిశాలమైన సముద్రము, ఎగిరిపడుచున్న పెద్దపెద్ద కెరటములు, గంభీరమైన యెత్తైన పర్వతపంక్తులు, ఉదయించు చున్న చందమామ నిశ్చలుడైపోయినా డతడు కొంతదనుక :

“ఎక్కడచూచినా ఉత్సాహము, ఆనందము, సౌంద ర్యము, మాధుర్యము. గొప్పగొప్ప భావాలతో మెరిసిపోతూ వున్న సృష్టిలోని తునుకలు...ఎందుకీ నా కొక్కనికీ యీ కలత, అసహనము——కేవలం వెర్రితనము......”

ఒక్కసారిగా ఆవేశప్రచురితమైన అతనిచూపు సముద్రపు టొడ్డున యిసుక తిన్నెలపై ఆనందమోహనమూర్తులై ఆడు కొనుచున్న బాలికాబాలకులవైపు, వరుసలు వరుసలుగా కూర్చుండి ఆ యానందసమయమున తియ్యని కలలాగు వెళ్ళ బుచ్చుచున్న యువతీయువకులవైపు పరుగెత్తినది. వెంటనే యెదోవిధముగానున్న చూపు చటుక్కున భావగర్భితమై పోయినది: మరల సముద్రముమీదుగా దృష్టిప్రసరించినాడు.

" అబ్బా సముద్రం......ఎంతవిశాలం......ఎంత ఆనం దం......దానికేసిచూశి వొడ్డున ఆడుకుంటూ కబుర్లుచెప్పు కుంటూ ఉన్న పిల్లనుచూస్తే యెల్లావున్నారూ! పిచ్చుకల్లాగా యిసుకరేణువుల్లాగా......ఆమహాశక్తి, ఎదో ఆలోచన కందని రూపం ముందు మనం......పసిపాపలము...... ఆమహానంతశక్తి యేమనుకుంటూ వుంటుందో పిల్లందరినీ చూశి......ప్రేమవర్షం యేకధారగా కురిపిస్తూంది. అమృ తంతో నింపివేస్తూంది లోకమంతా......గ్రహిస్తూందా లోకం......చెరుపుకుంటున్నాం, వచ్చినపని మరచిపోతు న్నాం...అంతా స్వప్నంలాగా సన్నని మబ్బుతెరలాగా వుంది. ...ఏమిటోతట్టుతుంది, ఏమిటో చెపుతూంది గాలి, తరంగాల గుసగుసలూ, వెన్నెలా, మబ్బుతునకలూ...... ఏమనీబోధపడడములేదే...అంతా ఆనందం, అంతా అమృ తం, అంతా మహాప్రేమప్రవాహం ప్రవహించిపోతూంది... మరియేమి చేస్తూంది లోకం, మఱచిపోయింది తన్ను తానే

అధఃపాతాళానికి కూలిపోతూంది...ఆనందంకోసం, అమృతంలో మునిగి తేలడానికి, ప్రేమప్రవాహంలో దానితో పాటే వడివడిగా కొట్టుకుపోవడానికి తన కీరూపు వచ్చిందని...... మరిచిపోయింది వెర్రిలోకం.

తెలిసింది, యిప్పుడు తెలుస్తూంది. ఎందు కింత వెర్రిగా కలవరపడ్డాను ఆమె చిననాటి స్నేహితునితో మాట్లాడినంత మాత్రాన. ఇంకేముంది యింతకన్నా తెలివితక్కువ"

ఇంతలో సేవకుఁడు తీసికొనివచ్చి గులాబీపూలు ఇచ్చినాడు రమణకు వివియానీ పంపినవి. రమణ సాయంకాలము వివియానీతో ప్రతిరోజు షికారు వచ్చునప్పుడు తమచేతులలో గులాబిపూలు పట్టుకొని పరిమళ మానందించుచువచ్చుట మామూలు. నేడాతడు పువ్వులు తెచ్చికొనుట మరచిపోయి వచ్చుటచే ఆమె పంపినది వానిని. సేవకుడు చెప్పినా డిట్లు.

"అమ్మగారు పావుగంటలో వస్తానని చెప్పమన్నారు గోపాల్ గారితో కలిసి." వాడు వెళ్లిపోయినాడు.

మరల ఆలోచనలో మునిగిపోయినాడు రమణ లోతుగా, పువ్వులు ప్రశాంతతరళదృక్కులతో వీక్షించి; అప్పుడాతని లేతహృదయము లోలోననే రహస్యముగా బాష్పబిందువులు విడిచినది :

"యింత సౌందర్యం, యింత ఆకర్షణ, యింతలాలిత్యము యెందుకు వీటికి వూరికినే నిరుపయోగంగా నిరర్థకంగా వీటి

కింత చక్కనిరూపు, మోహనత్వము అబ్బిందా, తరతరాలు గడిచి. యీ మార్పు యెందుకూ, దినదినము ఒక్కొక్క అడుగు ముందువేసి సృష్టిలోని ప్రతివస్తువు సాంగం కావడానికి యేదో ప్రయత్నము జరగడంలేదూ! యీ సంపూర్ణత్వానికి ముందునడక దేనికోసం...ఆనందం, ఆనందం, మరి మానవుడేమి చేస్తున్నాడు. రోజురోజు అభివృద్ధి పొందడానికి బదులు, ఆనందం అనుభవిస్తున్నాడా! నామట్టుకు నేనేమి చేస్తున్నా? ఆమె సౌందర్యమాతడు చూచిపోతాడేమోననేగా, ఆమెతో సంభాషించడమువల్ల కలిగే ఆనందము అతడనుభవించి పోతాడనేగా యింత వెఱ్ఱికలవరం పడ్డాను యింతసేపటినుంచీ. ఈ గులాబిపువ్వులు పెట్టిలోపెట్టి దాచి యెవరూ చూడకూడదు నేనొక్కణ్ణితప్ప అంటే యెల్లావుంటుంది. యీ డాల్ఫిన్సునోజు అందము, యీ మెరుస్తూ కనుల పండుగచేసే సముద్రము, యీ దివ్యసందేశాలుపంపే రవ్వల తారలు, చలువ వెన్నెలమూలంగా ఆనందప్రవాహం ప్రవహింపచేస్తున్న చందమామ, ప్రకృతికాంత నిత్యశుభానంద సమయంలో పరవశయై విడిచే నిశ్వాసాలు—ఎవరూ ఆనందించకూడదంటే యెల్లావుంటుంది? అంతకన్న అజ్ఞానముందా? యివన్నీ యిల్లావుండగా గులాబిపువ్వుల్ని పెట్టెలోపెట్టి దాయడము—క్రూరం నీచం, వెఱ్ఱితనంకాదూ?

ఇంతా ఆలోచిస్తూ నేనేమి చేశాను యిందాకడనుంచీ! ఆమెతో బయటికి షికారువస్తాను. సముద్ర మొడ్డున తిరుగు

తాము; వెన్నెల్లో యీదుతాము సముద్రపు చేపల్లాగు; కాని యింటిలోకి ఒక స్నేహితుడువచ్చి మాట్లాడితే మళ్లా అసూయా, అసహనమా...అదికాదు చిన్నప్పటి స్నేహితుడని ఆమెకి...ఛీ, యేమి చిన్నప్పటి స్నేహితుడైతే! యిల్లాగే తెలివితక్కువచేతే చెరుపుకుంటాము, నలిపివేస్తాము, జీవనపుష్పాన్ని. ఇంతకన్నా ఘోరముందా ఆమె నడిసముద్రములో అట్టడుగున బ్రతకాలి అనడముకంటే, యిప్పుడైనా మెలకువ కలిగి ఆమె వచ్చినప్పుడామెదగ్గర చెప్పివేయాలి యీ కలవరమంతా. లేకపోతే యిదిమళ్లా యెప్పుడైనా తలచూపడానికి అవకాశము దొరుకుతుంది. ఒక్కసారి ఆమె ముందు అనుతాపపడితేనే కాని నా విధ్యుక్తధర్మము నేను నెరవేర్చుకున్నట్టు కాదు...తుపానుకు ఆకులు రాలినయి. మళ్లా చిగురుస్తూవుంది. జోరుమని వర్షం కురిస్తే ధూళిదూసరి కొట్టుకుపోయి మార్గము అద్దంలాగా తయారయింది......అదుగో తరంగాలలో చంద్రుడు, చుక్కలు తునకలుతునకలుగా కనిపిస్తూవున్నా అల్లాగే మెరిసిపోతూవున్నాయి అనంతాకాశములో అవి చలనము, కళంకమూ లేకుండా..."

సముద్రనిశ్వాసములలో ఆమె చీరచెరగు ముచ్చటగా ఎగురుచున్నది. వేణుగోపాల్ ఆమెతో నేమిటో చెప్పుచు నవ్వుచున్నాడు. ఆమె అతనివంక, యెగిరి యెగిరి గంతులు వేయుచున్న అలలువైపు చూచుచు చిఱునగవు వెన్నెలలతోడనే జవాబుచెప్పుచున్నది. రమణ వెన్నెలలో మిళితమైపోవుచున్న

దరహాసముతోడనే వారి నెదుర్కొని, అందఱును కలిసి రైలు బడ్డీలువైపు మేరీ దేవాలయముదిక్కుగా వెళ్లినారు.

"గోపాల్‌గారు, మీరు హోటలులో బసచేయడమెందుకు, యిక్కడికే తిన్నగా రావలసింది" అన్నాడు రమణ.

"ఇప్పుడైతే నేమిలెండి, చీటీపంపి సామాను తెప్పించివేద్దాము యిత నిక్కడుండిపోతాడు." అన్నది వివియానీ. వేణుగోపాల్ నవ్వుచు ఊరకున్నాడు.

"ఏమండీ, వివీ యేమిచెప్తూవుంది యింతసేపు." అన్నాడు రమణ నగుమోముతో.

"మీకెందుకు ? ఎన్నికబుర్లు చెప్పుకున్నా మనుకున్నారేమిటి, కొండన్ని" ఉప్పొంగిపోవుచున్న ఉత్సాహముతో అన్నది వివియానీ.

"మాసుబ్బులు అందరిలాగా కాదండి చిన్నప్పుడుకూడా అంతే—"

"అదుగో మళ్లా ఆపేరుతో పిలుస్తున్నారు. వివీ అనాలి"

గోపాల్ నవ్వుచు..."అల్లాగే అంటాలెండి కాని—బాల్యం సముద్ర ప్రయాణంలాంటిదండీ. ఎంతముచ్చటగా వుంటుందనుకున్నారు స్టీమరులో వున్నప్పుడు నలువైపులా స్వప్నంలాగా సముద్రం, అప్పుడప్పుడు రెండుమూడు పిట్టలు, అల్లా వుంటుంది చిన్నప్పుడు. అటువంటి బాల్యంలో యీమె పొందిన ఆనందానికన్నా, అప్పుడు తనలో మిళితంచేసుకున్న అమాయికత్వానికన్నా, అవి తెలుచుకొని యిప్పుడీమెపొందే

సంతోషము ఎన్నోరెట్లు అధికంగావుంది. అంతేనండి కొందరి స్వభావాలు. ఒకసమయంలో తాము అనుభవించే సంతోషముకంటే, అది గడిచిపోయిన తర్వాత వాటిని తలుచుకొని, నెమరువేసుకొని, ఆకాలాన్ని దూరంగా వున్నట్టు భావించుకొని యెన్నోరెట్లు ఆనందం, ఉత్సాహము పొందుతారు కొందరు. ఈమెకూడా అంతేనండీ. ఎవేవో చిన్నప్పటి సంగతులు వొకటితర్వాత వొకటి తియ్యనికలల్లాగు జ్ఞాపకమొస్తూ వుంటే మాటాడుతూ కూర్చుండిపోయాము."

"అవునండీ, నాకొక్కప్పుడదే విచిత్రముగా కనిపిస్తుంది. మామూలుగానే మనముచూసే వస్తువుల్ని యేచిత్రకారుడో, యేకవో, కుంచెతీసుకునో, లేఖినితోటో చిత్రించితే వాటికెంతో ముచ్చటైన అందము వస్తుంది. అల్లాగే అయివుంటుంది యిదికూడాను, గడచిపోయిన సంగతులు మననము చేసుకోవడమువల్ల కలిగే ఆనందం, ఉత్సాహము అనిపిస్తుంది. అవునండీ మనలో కవిహృదయము లేకపోయినా గడచిన సంగతులు కలల్లాగు జ్ఞాపకమువచ్చి భావించుకుంటూవుంటే కవికి, చిత్రకారుడికి ఉండే యెదోశక్తి మనకుకూడా తనంతతానే కలుగుతుందనుకుంటా. ఏమంటావు, విపీ"

"అయి వుంటుంది" అన్నది ఆమె అమాయికపు పసిపాపవలె నవ్వుచు.

ఇంక నేమేమో మాట్లాడుకొనుచు, చలువ వెన్నెల, గభీరపర్వతములు, వానిపైని పెద్దపెద్ద తెల్లని మేఘములు ఆనం

దించుచు, ఒక్కొక్కప్పుడు మబ్బుతునుకలపై మెరియుచున్న చందమామ చల్లని చూపులు గాంచుచు, తమకు తెలియకుండగనే శ్రోత్రపర్వ మొనర్చుచున్న తరంగముల 'హోరు' తెలిసికొనకుండగనే మెల్లగా నడచుచు వారు రైలుబద్దీలకోస మేర్పరుపబడిన లోయ సమీపించినారు.

ఆగుహ కెదురుగనున్న లోయ తోట, తోటకిరుకెలంకుల యెత్తైన మనోహరమైన పర్వతములు, వీనిముందు విశాలమైన కాలువ, ఆనీరమున ప్రతిబింబించుచున్న సుధాకరుని మనోహరమైన ప్రతిరూపు, ఒకవైపు ఘోషిల్లుచున్న సముద్రము, మఱొకవైపు నిశ్శబ్దములై గభీరముగనున్న పర్వతశ్రేణి-యివన్నియు గాంచి వేణుగోపాల్ నిస్తబ్ధుడై నిలువడిపోయినాడు. అటులనే చటాలున నిలువబడిపోయి తన్మయానందమున ఆయనంతసృష్టిసౌందర్యము నీక్షించుచు ముగ్ధుడైపోయినాడతడు.

రమణ వివియానీ భుజముపై చేయివైచి లోయలోనికి కొంత దూరము తీసికొనివెళ్లి అమెకోమలహస్తముల కేలగీలించి పైకి దృష్టి పరికించినాడు.

ఆయెత్తైన పర్వతముముందు తానెంత...గభీరదృష్టితో తమకు రెండువైపుల సమీపముగనేయున్న పర్వతము చూచినాడతడు. హృదయము చలించినది; వేగ మినుమడించినది. ఇట్టులన్నాడు గభీరవదనమున సన్నని కంఠముతో రమణ:

"వివీ, ఏమిచెప్పను! హృదయము తరుక్కుపోతూంది. యింతసేపటినుంచి హృదయంలో తుపాను పుట్టింది. మన ప్రేమలతకు తుపానుదెబ్బ బాగా తగిలింది. కొన్నిఆకులు రాలి పోయినవి. అయితే నేమి ధన్యుణ్ణి, రాలిపోయిన ఆకులు మళ్లాతీగకే మెరుపుగా మారిపోయినవి......"

వివియానీకిదియంతయు నేమిటో బోధపడలేదు. ఆమె తెచ్చుకొనిన నవ్వుతోడనే.

"ఇదంతా నాకేమీ అర్థము కావడము లేదండీ, క్షమిం చండి" అన్నది.

"అయితే చెప్తాను విను. నువ్వు గోపాల్‌గారితో మాటాడుతూంటే యెందుకో వెర్రి అసహనము కలిగింది. ఏమి టీవెర్రితనమంతా అని ఆలోచించా. అంతకన్నా మంచి భావా లెల్లాగుకలుగుతవి యినుపమరలవంటి పూర్వుల రక్తము యీరక్తంలో ప్రవహిస్తూ వున్నప్పుడు అనుకున్నా...యిప్ప డింతకూ చెప్పవచ్చే దేమిటంటే ఆఅసహనము, అసూయ ఘోరపాపమని గ్రహించా, అవి యెంత తేలికగా వచ్చినయ్యో అంత తేలికగా కాకపోయినా వాటిని వెంటనే హతమార్చి వేశా...యీవిషయము నీతో చెప్పి మన్నించమని కోరవలె నని మనస్సు యిందాకడనుంచి తహతహ లాడింది. అటువంటి ఘోరపాపానికి పరిహారము అయిపోయింది...మన్నించావను కుంటా..."

వివియానీ నిర్విణ్ణయై, నిస్తబ్ధయై నిలువున నీరై పోయినది. ఒక్క రెండు నిమసము లటులనే ఆమెకనులు పెద్దవిచేసి తదేక దృష్టితో శూన్యహృదయముతో పతివైపు చూచినది. ఆమెకు తెలియకుండగనే ఒకటిరెండు బిందువు లామె కనుకొలంకుల నుండి జారి పడినవి. ఒక్క నిశ్వాసము విడిచి :

"మీవంటి పతి దొరకడము నిజంగా నాఅదృష్టము..." అని గుటకమ్రింగిన దామె.

రెండు నిముసములు వారటులనే ఒకరిహస్తము నొకరు పట్టుకొని ఆకొండనడుమ ప్రతిమారూపమున నిలుచుండి పోయినారు.

కొంతసేపటికి వివియానీ తేరుకొని మృదుకంఠముతో :

"గోపాల్‌గారు, వెళ్లుదాము రండి" అన్నది.



## రాజహంస :

తళతళ మెరిసిపోవుచున్న ఎత్తయిన గంభీరమైనమంచుకొండలు వరుసలుదీరియున్నవి. కొండలనడుమ నుండి సూర్యరశ్మివలెనే ప్రవహించుచున్న తేజోవంతమైన సుస్నిగ్ధజలవాహినివచ్చి సరోవరమున గలియు చున్నది. ఆవిశాలసరోవరమున వివిధ వర్ణముల వికసితపద్మములు—నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు. తీరమున అనేక జాతులపూలచెట్లు, తీగెలు. వాని వెనుక దట్టమైనకాఅడవి. మంచుకొండలపై సూర్యప్రకాశము దేదీప్యమానమై వెలుగొందుచున్నది. సరోవరము, కమల ములు చల్లనిమబ్బునీడలో నున్నవి. లతానికుంజములపై జల్లువాన కురియుచున్నది. కాననమున కారుమబ్బులు, ఉఱు ములు మెఱుపులు. ప్రబలమైనతుపాను, గాఢాంధ కారము.

విమలాకాశమున నెలబాలునివలె సదమలసరోవరమున రాజహంస మనోహరముగా మధురమందముగా విరుల వలపులో వియత్తరంగములపై దేలియాడుచున్నది. గగన సీమను ప్రకాశించుచున్న ఇంద్రధనువు జూచి సనుగాంచి రాజహంస చిఱునగవుతో నిట్టులన్నది. “ఓమానవుడా! చూచినావా, ఆమెరిసిపోవుచున్న నక్షత్రాలు, వింతరంగుల ఇంద్రధనస్సు, ఈవిశాలమైన సుందరమైన ప్రకృతి : దీనిముందు నీ వెంతటి వాడవు ? ఈమాత్రమునసే నీవు క్రిందుమీదు తెలి యక ఎగసిపడిపోవుచున్నావే! నినుపోల్చుటకే విశాలసృష్టిలో

ఇంకేమియులేదని నీవు విర్రవీగుచున్నావు. ఒక్కసారి కనులు తెరిచి నిన్ను నీవేచూచుకొనుము, ఎట్లుందువో!"

నేను ఆకసమువైపుచూచితిని. ఒకేసారి సూర్యదీప్తి, నక్షత్రములు, ఇంద్రధనుస్సు ప్రకాశించుచున్నవి. తర్వాత నన్ను నేనుగాంచితిని. అప్పుడు నేనొక రేణువురూపముదాల్చితిని. నవ్వుచు: "అవును రాజహంస! మానవుడు ఈ అనంత మైనసృష్టిలో కించిన్మాత్రుడే."

రాజహంస:—ఇది తెలిసికోలేక మానవజాతి మాయంతటివారులేరుఅని విర్రవీగుచున్నది. అణువుకంటె అణుమాత్ర మైనమానవుడు తనబుద్ధి, ప్రతిభచూచి సిగ్గుపడి నవ్వుకొనుటకుబదులు ఉన్మత్తుడై సంతోష పడుట, గర్వపడుటచూచి నాకు జాలికలుగునుసుమీ! స్త్రీనిచూచి, స్త్రీరూపముచూచి మీరుపొందే సంతోషము, వర్ణించేవర్ణనలుచూచితే నవ్వు వచ్చును. సృష్టిఅంతట మగజాతియే సౌందర్య మైనదయి యుంటే మీరు మానవులు గ్రుడ్డివారైపోయి స్త్రీకి మోకరించి పూజసేయుచున్నా రెందులకు? ఈకమలములవంక చూడుము. నీస్త్రీని ఊహించుకొమ్ము. వీనిసౌందర్యము, మనోహరత్వము ముందు స్త్రీయెంతటిదో ఊహించుకొమ్ము. ఒక్కలేతఆకుకున్న లావణ్యమైనాఉండదే నీస్త్రీకి? మరెందుకు మానవుడు స్త్రీముందు కుంగిపోవు చున్నాడు? ఆమె చూపులో కరిగిపోవుచున్నాడు, ఆమె తాకితే పులకరించిపోవుచున్నాడు? వినుము. నీస్త్రీకల్పనామయి వేరేమియుకాదు;

కాజాలదు. ఆమె యేరూపముతో పుట్టినదో ఆరూపమును మఱచి మానవుడు క్రొత్తరూపమును సృష్టించుకొనుచున్నాడు. ఆరూపము కొన్నాళ్లకు భగ్నమైపోతే ఆతడు కూలిపోవుచున్నాడు. ఇదిమరిచిపోయి అంతలోనే నాయంతటివాడులేడు అని గర్వించుచున్నాడు. ప్రకృతిని జయించ కలుగుచున్నానని వొళ్లుమరచుచున్నాడు. అయ్యో! వెఱ్ఱిమానవుడా! నీవేమి మహత్తరకార్యము చేయ గలిగినావు?

నేను:—రాజహంసా! అట్లుచెప్పెదవేమి? మానవుడు నీటిని, గాలిని—పంచభూతములను జయించగలిగినాడు. మానవున కవి యిప్పుడు దాస్యముచేయుచున్నవి. అంతకంటె ఇంకేమికావలయును?

రాజహంస:—ఓయి వెఱ్ఱివాడా! ఇంతమాత్రమునకు సంతోషించుచున్నావా? నీసంకుచితమైన మనస్సు, హృదయముచూచితే నవ్వువచ్చుచున్నదిసుమా! మానవుడు సృష్టిలోనికివచ్చి యెన్ని నాళ్ళయినది? కొన్ని వేలు, లక్షలు, కోట్లు సంవత్సరములైనవే. ఇంతకాలమునకు మీరు చేయకలిగిన పనులు, చూడుము. కాకి, పిచ్చుక సృష్టి ప్రారంభమునుండియే చేయగలుగుచున్నవి. గాలిలో, నీటిపై, భూమిమీద ప్రయాణము చేయ కలుగుచున్నానని నీకుగర్వము. పిచ్చుక ఆనాడే యివన్నియు నేర్చుకొన్నదని మరిచిపోయితివి, ఏమేమో పంచభూతములను జయించినానని గర్వపడుచున్నావేకాని నీకు ఆనందమేది? తృప్తియేది? క్రిమికీటకాదులు కలనైనా యెరు

గని రోగములతో, బాధలతో నీవు బాధితుడవగుచున్నావు. ఆబాధలు, రోగములు మాన్పుకొనుటకై నానాకష్టములుపడి పక్షుల, జంతువుల మలమూత్రములుకూడ నీవు భక్షించుచున్నావు. ఎన్ని చేసినను స్వేచ్ఛగా ఆనందవశమైతిరిగే పక్షికున్న ఆనందము నీకేది? ఉత్సాహము నీకేది? శాంతినీకేది? అనేక బంధనములలో నీవు కట్టుపడిపోయియున్నావు. నీకు స్వేచ్ఛలేదు. నీవు బంధితుడవు.

నేను :—మానవుడు బంధితుడెట్లగును? ఇదివరకే కొన్ని దేశములు స్వేచ్ఛకై పోరాడి సంపాదించుకొన్నవి దానిని. కొందరింకను ప్రయత్నము చేయుచున్నారు : కొన్నాళ్లలోనే తెచ్చుకొందురు, వారుకూడా.

రాజహంస :— ఓయి వెర్రివాడా! మానవుడు స్వేచ్ఛ అంటేయేమిటో యెరుగడు. అది యిట్టిదని చెప్పుటకు వలనుపడనిది. మాటలకు దానిని తెలిపేశక్తిలేదు. సృష్టినిగమనించుము శ్రద్ధతో, సూక్ష్మబుద్ధితో. స్వేచ్ఛఅంటే నీకేమిటో కొంతవరకైనా తెలియగలదు. స్వేచ్ఛవిషయములో మీరు పుట్టుకలోనే జంతువులకంటె, పక్షులకంటె తక్కువదశలో సృష్టింపబడినారు. స్వేచ్ఛగాతిరిగే ఆ తేనెటీగను చూడుము. అది ప్రకృతిలో విలీనమైపోయి స్వేచ్ఛగాతిరుగాడుచున్నది. మానవుడో ప్రకృతినతిక్రమించుట స్వేచ్ఛఅని పొరబడుచున్నాడు. ఆరీతిగా అతడు స్వేచ్ఛనుపొందజాలడు. ఆతడు

ప్రకృతిలో విలీనమైనప్పుడే ఆయానందము నందుకొని ఆనం దించగలడు.

నేను :—ఆయానందముకొరకే మేము లోతుగాఆలో చించి శాస్త్రములు, నియమములు ఏర్పరచుకొని యున్నాము. శాంతిజీవనముపొందుచున్నాము. జంతువులు, పక్షులు—వాటికి నీతినియమములులేవు. మహాపాప భూయిష్ఠ మైనది వాటి బ్రదుకు.

రాజహంస :—ఓయి, అజ్ఞానుడా! మీశాస్త్రములు, కట్టుబాట్లుతీసుకవెళ్లి నడిసముద్రములో పార వేయుము. అప్పుడే నీవు స్వచ్ఛమైన పునర్జన్మయెత్తగలిగెదవు. అంతవరకు నీకు పాతాళమేగతి: నీవు మానవజాతిఅంతా ఒక్కటేఅని మరచిపోయి నీలోనీవు అనేకజాతులు, కులాలు, మతాలు, రంగులు తెచ్చుకొన్నావు. అనేక వెర్రిఆచారాలు, అనేక పిచ్చికట్టుబాట్లు, అనేక అర్థములేనిరీతులు ఏర్పరుచుకొన్నావు. మీలో ఒకరి జాతి, శాస్త్రము, కట్టుబాటుఅంటే యింకొకరికి అసహ్యము. ఒకరినిచూచి యింకొకరు సహించలేరు. మాన వుని వదలివేసినసృష్టిలో ఈవెర్రితనము, అజ్ఞానము, పాపము ఇంకెచ్చటనులేవు. మేము సృష్టిఅయిననాడు ఎట్లున్నాము! ఈనాడుకూడా అటులనే స్వచ్ఛమైనజీవనముగడుపుచున్నాము. మానవుడో అతడు సృష్టిఅయినప్పటిజీవితము ఇప్పుడు తారు మారైపోయినది. తాను తెలివిగలవాడననుకొని వెర్రిమొర్రి గ్రంథాలు, కట్టుబాట్లు, జాతులు తనలోతానేసృష్టించుకొని

తననాశనమునకు తానే కారకుడై పోయినాడు. శాంతి, ఆనందము, ప్రేమ వీనిని మరిచిపోయి వానిని చేతులార పోగొట్టుకొనియిప్పుడు తాను పొందుచున్నదే శాంతిఅనీ, ఆనందమనీ, ప్రేమఅనీ భ్రమించిపోవుచున్నాడు. వీని నిజరూపము నాతడు కోల్పోయినాడు. ప్రకృతికి అతడు దూరమైపోయినాడు. తన సృష్టి వేరుపరచుకున్నాడు. ఆకలుషకూపములోపడి అదియే మహాస్వర్గమని మురియుచున్నాడు. సృష్టిఅయిననాడెట్టులానందమూర్తులమైయున్నామో నేడును అటులనే మార్పులేక యున్న మేము ఆ కూపకలుషనివాసులను దుఃఖమూర్తులను చూచి జాలిపడుచున్నాము. అకల్మషమైన, ఆనందమయమైన, శాంతిమయమైన, ప్రేమమయమైన సృష్టిజీవనము మాలో మూర్తీభవించి యున్నది. నిజమైన స్వేచ్ఛకు భంగము కలిగించని నియమములు, శాస్త్రములు మారక్తములో ప్రకాశించుచున్నవి. మాజీవనములో వికసించుచున్నవి. వెర్రి శాస్త్రములు, అర్థములేని కట్టుబాట్లు మేమిక సృష్టించుకోవలసిన అవసరములేదు. ప్రకృతియే మేము, మేమే ప్రకృతి అయియున్నప్పుడు—అంతట ఆనందము, శాంతి, ప్రేమ. మీవలె మాకు దుఃఖము, అశాంతి, ఈర్ష్య లేవు. మీరు ప్రకృతికి దూరమైపోవుటలోనే పతితులైపోయినారు. అంతకు మించి మీశాస్త్రములు, కట్టుబాట్లు సృష్టించుకొనుటతో మరింత పతితులైపోయినారు. మీకు ఇంతలో ముక్తిలేదు. ఇక పాపపుణ్యములందువా! మీలో ఒకనికి పాపమైనది

మరొకనికి పుణ్యమగుచున్నది; ఒకనికి అవినీతియైనదియే ఒకనికి నీతి యగుచున్నది. ఇంకెట్లు పాపపుణ్యములకు, ధర్మాధర్మములకు, నీతి అవినీతులకు నీవు అర్థము చెప్పగలవు? ఈపాపపుణ్యభేదము నీవు సృష్టి నతిక్రమించి సృష్టించుకొన్నావు వేరొకడు ఇంకొకరీతిగా ధర్మాధర్మ విచక్షణ చేసికొను చున్నాడు. ఇది నీతి, అది అవినీతి అని నిర్ధారణగా మానవునకు చెప్పేశక్తిలేదు. మాకో రెంటిభేదమేలేదు: మాకు పాపములేదు, పుణ్యములేదు. ఈరెంటికిని అతీతులమే మేము. ఇకెట్టులు మాది పాపభూయిష్ఠమైన జీవనమనగలవు? ఓహో! నీదృష్టిలో దేవుడుకూడా పాపియేఅగుచున్నాడుగా! అదియే నీ సంపూర్ణపతనమునకు కారణమైనది. నీవు ఱాయినిపూజించితే పుణ్యమువచ్చుననీ, పామునుపూజించితే స్వర్గమువచ్చుననీ మురిసేవాడవు. నామాట నీకేమిబోధపడగలదు? పరమేశ్వరుని ప్రతిబింబమైన ఈమహానంతసృష్టి కనులయెదుట అద్వితీయమైన తేజస్సుతో, సౌందర్యముతో, జీవకళతో ప్రకాశించుచుండగా చూచి ఆనందించి ఆరాధనచేయజాలక నీవు ఱాయిని అప్పను పూజించుటతో తృప్తిపడుటచూడగా నవ్వు వచ్చును. మరియు నీవు ఎదుటనున్న ప్రకృతిసంతానమును ప్రకృతినిచూచి ఆనందించలేక వానిజీవములేని బొమ్మలు, నీగృహములో పెట్టుకొని మురియుచున్నావు. సంకుచితుడవు. ఇంకను సంకుచితుడవై పోయెదవు కొన్నాళ్ళకు. జంతువులను, పక్షులనుచంపి వానితో నీవు, నీస్త్రీ అలంకరించుకొను

చున్నారు. అలంకరించుకొని యింతటిసుందరు లింకెవరునులేరని గర్వపడుచున్నారు. ఓయి వెర్రిమానవుడా! ఒక్కఆకు, ఒక్క పువ్వుతీసికొని వానితో నీ సౌందర్యము, నీస్త్రీ మనోహరత్వము పోల్చి చూచుకొనుము: నీవు, నీయలంకారములు వానితో పోల్చుటకైనా అర్హతలేకుండా పోవుచున్నారే! ఇంకను గర్వం చెద వెందుకు?

నేను:—రాజహంస! గర్వమున కేమి లెమ్ము. నిజమగునా కాదా మాకు విలువలేని ధనసంపత్తి, స్వచ్ఛమైనకీర్తిసంపత్తి ఉన్నమాట! మీకో అవియేవి?'

రాజహంస:—వినుము! ఆదిలో మానవుడు శాంత ప్రేమానందమూర్తిగా రూపమునందినాడు, ఇతరజంతుసంతా నమువలెనే. కాని అతడు ధనమనీ, కీర్తిఅని వీనిసంపాదన కోసము పాటుపడి వీనినిపొంది తన్ను—అంటే తనఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ—కోల్పోయినాడు. అంతటితో అతని నిజరూపము మాసిపోయినది. అతడు కల్పితరూపము పొందినాడు. ధనము, కీర్తి ఎందుకొరకు కావలెనని మానవుడు ప్రయత్నించుచున్నాడు? ఆనందము—సౌఖ్యముకొరకేగదా! కాని యేధనకీర్తులమూలముగా అతడు ఆనందసౌఖ్యములను పొందదలచుచున్నాడో వానిమూలముననే ఆయానందసౌఖ్య ముల నాతడు గోల్పోయి పతితుడై తన్నుతాను కోల్పోవు చున్నాడు. తనుపుట్టి యిన్నాళ్ళయినను తనతప్పు తాను తెలి సికోలేకున్నాడు. మానవుని ప్రపంచమంతయు గెలువనిమ్ము

కాని తన్ను తాను కోల్పోయిన ఆప్రపంచముతో ఆతనికి ప్రయోజనమేమున్నది? ధనకీర్తుల సంపాదనములో అతనికి తీరికలేదు. తృప్తిలేదు. అందుచేతనే అతడు తనప్రకృతిసిద్ధమైన ఆనందమును, ఉత్సాహమును, శాంతిని, ప్రేమను కోల్పోవు చున్నాడు. వీనిగూర్చి ఆలోచించుటకైనా అతనికి సమయము చిక్కదు. వీనికొరకు అతడు తనసౌఖ్యముకూడా పోగొట్టు కొనుచున్నాడు. యుద్ధములుచేసి మనుష్యజాతిని నాశనము చేయుటకుకూడా అతడు వెనుకాడుటలేదు. పతితుడైపోయి నాడు. పతితత్వమునుండి పావనత్వము పొందవలెనంటే అంద రకు సరిసమానముగా ధనముండవలెనని మరియొకడను చున్నాడు. ఆప్రయత్నములో అతడు కొంతసౌఖ్యము నాశన ముచేసికొనుచున్నాడు. సరిసమానముగా పంచుకొనినను ప్రకృతి సంతానములో ఉన్నఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ వారిలో కనిపించుటలేదు. మేమో: మాకు ధనముతో, కీర్తితో అవసరములేదు. వీటికి మేము అతీతులమైయున్నాము. అందుచేతనే మేముకూడ మానవునివలె క్రుంగిపోవక మమ్ము లనుమేము కోల్పోవక ఆనందమూర్తులమైయున్నాము. మీవ లెమేము వానికోసము యుద్ధములుచేసి సరిసమానముగా పంచుకోవలెనని బాధపడము. వానిపై కోరికఉన్నచో మాన వునివలెనే మాకును పతితత్వము కలిగియుండెడిది. ఒక్కవిష యముచూడుము: మీలో కోటీశ్వరుడుండనిమ్ము. కాని అత నికి ఒక చిలుకకున్న ఆనందము, ఉత్సాహము, శాంతి, ప్రేమ

యేవి? అది స్వేచ్ఛగా, మనోరంజకముగా తిని తిరిగి గానము చేయును. అవి అతనికేవి?

నేను :—ఏమైనను ఇహాపరసాధన మెరిగినవారము మేము.

రాజహంస:—వెర్రివాడా! పెద్దపెద్దమాటలు మాటాడుచున్నావు. ఇహము, పరము—ఉట్టికెగరలేనిది స్వర్గానికెగిరిందని: ఈలోకము, ఈజీవనము తెలిసికోలేని నీవు ఇచ్చట ఆనందము, సౌఖ్యముపొందనినీవు పరలోకములో నేమియో చేయకలిగెదవనేది వెర్రిభ్రమ, ఇప్పుడు ఆనందమున్నదా లేదా అనేది అంత ప్రాముఖ్యమైనవిషయముకాదు. పరలోకానందముకోసము ఇప్పుడు కష్టమనుభవించుతామనేది అంతకంటే నమ్మతగినమాటకాదు. ఇక్కడ ఇప్పుడే ఆనందించవలె: అప్పుడేనీవు సఫలుడవు, ధన్యుడవుకాగలవు.

నేను :—రాజహంస! మానవుడు దైవమును తెలిసికొనిన విజ్ఞాని కాదా మరి!

రాజహంస :—ఏమి? మానవుడా! నీవు దైవమును తెలిసికొన్నావుగా! ఆకాశముఎదుట కనిపించుచునేయున్నది. అది అనంతము. దానిని నిరూపణచేయుట నీచేతకాదు. అటులనేదైవము. అయినను—ఇరుగు పొరుగువానిని ప్రేమించలేని నీవు, ఇరుగుపొరుగువానిని తెలిసికోలేనినీవు దైవమునుకూడా తెలిసికొనగలవా? అందుకు నీశక్తిచాలదు. అతడు ఆనందమూర్తి. ఆనందమునుండియే ఈసృష్టి వెల్వడుచున్నది. ఆనందముచేతనే పోషింపబడుచున్నది. అంతట ఆనందతేజస్సు,

ఎటుజూచినను ఆనంద్భామృతమే. ఈఆనందమును గ్రోలుటయే నీపని. అప్పుడు నీకు అతనిని తెలిసికోవలెనను పిపాసలేదు. విమలనీరమున సంచారముచేయు మత్స్యమునకు దాహమెక్కడిది ?......ఉత్సాహము—ఆనందము—శాంతి—ప్రేమ...... ఆనందించుము—అమృతము......మానవుడెందుకో బ్రతుకుచున్నాడు......ఎందుకో మరణించుచున్నాడు...

* * * *

ఫెళ ఫెళార్భటులు. మేఘములు గట్టిగాఉరిమినవి. తనవల్లనే సృష్టియైన మబ్బులు తన్ను కప్పివేయుటచూచి సూర్యభగవానుడు నవ్వుచున్నాడు. ఆనవ్వు వెలుగులో లోకము ఆనంద పులకితమైనది.

---

# పరివర్తనము:

మౌంటురోడ్డులోని 'బసటో' హోటలులో సాయంకాల ఫలాహారము నారగించి యొకరి హస్తము నొకరు పట్టుకొని అప్పుడే బయిటకు వచ్చిన రాధారమణను, ఆంగ్ల యువతిని ఆనంద పులకిత దృష్టులతో గాంచి వీరరాఘవస్వామి ఒక అరనిము సము నిలువబడి 'గుడ్ ఈవినింగు మిస్టర్ రమణ' అని హస్త చాలనము చేసినాడు.

స్వామి 'మిమ్మల్ని చూచి అప్పుడే అయిదు సంవత్సరాలయిందనుకుంటాను. తిరిగి చాలారోజులకు కలిశాము. ఇప్పుడెక్కడుంటున్నారు? ఏమిచేస్తున్నారు?'

రమణ 'మైలాపూరులో ఉంటున్నాను. మూడు నెలల క్రిందటనే యూరపునుంచి వచ్చాను. ఇకముందుకూడా యిక్కడే ఉంటాను. ఒకసారి మాయింటికిరండి' అని తన భవనముయొక్క వివరములు తెలుపు కార్డు మిత్రునకిచ్చెను. వీరరాఘవస్వామి కార్డుచూచి చిఱునవ్వుతో 'అల్లాగా, రమణ! కలియక కలియక చాలరోజులకు కలియడము శుభవార్త. బాగుంది. తప్పకుండా వస్తాను. రేపు ఆదివారము కూడాను. ఉదయాన్నే వస్తాను' రమణ 'తప్పకుండా రావాలి సుమా! ఉదయాన్నే కాఫీయేర్పాటుచేస్తాను. అన్నట్టు ఇక్కడ పనేమిటి స్వామి. ప్రమాదవశాత్తు అరవవారిలో కలిసిపోలేదు కదా' ఇరువురు నవ్వుకొన్నారు. ఆంధ్రము తెలియని ఆయాం

గ్గరమణి వారి సంభాషణ మేవిషయమునుగూర్చియో యెరుం గక పోయినను వారిరువురు దరహాసితవదనులగుటజూచి తాను కూడ మెల్లగానవ్వినది. అప్పుడా గులాబిపువ్వువంటి చిన్ని నోరు కొంచెము మాత్రమే వికసించి తెల్లని పై పలువరుస కొనలు కనిపించినవి. రాధారమణ తన కెంతో ప్రియమైన అట్టి చిఱునగవును, మందమారుతమునకు కదలు గులాబి రేకువలె కదలుచున్న పై పెదవిని విశాలనేత్రములతో దిలకించి, మిత్రుని యెదుటనే ఆచిన్నినోటిని దృష్టులతోడనే ముద్దిడి, స్వామి వైపు దిరిగినాడు.

సన్నని లేతశరీరము—ఆకుపచ్చని పట్టుగౌనుచూచి, ఆమె ప్రక్క ఆకసపురంగు సూట్‌లోనున్న రాధారమణను వీక్షించు చున్న స్వామిదృష్టి మరలించుకొన్నాడు.

స్వామి 'లేదు అరవవారిలో కలిసిపోలేదు. ఇక్కడొక ఇంగ్లీషు దినపత్రికాలయంలో సహాయ సంపాదకుడుగా ఉంటు న్నాను రెండు సంవత్సరాలనుంచి'

రమణ 'అల్లాగా, నాలుగు నెలలుక్రిందట లండన్ టైమ్సు పత్రికలో వి. ఆర్. స్వామి అనే పేరుతో మన గ్రామజీవనము నకు, నగరజీవనమునకు తారతమ్యం తెలుపుతూ ఏదో వ్యాసం చూచాను. హోటలులో కూర్చుండి నేను ఇంకొక అమెరికను స్నేహితుడు చాలశ్రద్ధతో చదివాము. అప్పుడు కర్తగురించి ఆలోచనే లేకపోయింది సుమీ.'

స్వామి హాసవిలసిత గభీరవదనముతో 'అవును నేనే రమణ! గ్రామజీవనంఅంటే జ్ఞాపకంవచ్చింది. నాలుగైదేళ్ల క్రిందట నేను కలకత్తాలో యం. ఎ. చదువుతూ ఉండగా ఒక మిత్రుడు కనిపించి "మన రాధారమణ బి. ఏ. ప్యాసుచేసి సొంత గ్రామంలోనే ఉంటున్నాడు. ఏమో విరాగిమెక్కువైందట. సన్యసిస్తాడని అనుకుంటున్నారు." అన్నాడు'

రమణ నవ్వుచు 'అవును, నిజమే! రేపువస్తే చరిత్ర చాలా చెప్పవలసివుంది. ఆచరిత్రలో ఈవిషయమొక ప్రకరణం. స్వామి! రేపు తప్పక రావలెసుమా ఉదయాన్నే!'

స్వామి చిరకాలమునకు గనిపించిన మిత్రునిగాంచి యానందించుచు 'రమణ, అల్లాగే తప్పకవస్తాను. గుడ్ ఈవ్‌నింగ్' అని బసటో హూటలు ప్రవేశించినాడు.

రమణ, ఆతని సతీమణి ఆంగ్లరమణి యొకరిచేయి యొకరు పట్టుకొని యొకరి వదనము నొకరు చూచుకొనుచు మెల్లగా మోటారుకారులో గూర్చుండిరి.

సతీమణి చిన్నినగుమోము చూచుచుండగనే రమణకు పూర్వచరిత్రమంతయు కన్నులకు గట్టినట్లయినది.

ఆతనికి తనకనుపాపలో బరుగిడుచున్న మందిరముల విషయమే తెలియలేదు. మందిరముల శూన్యదృష్టితో జూచుచుండగనే తనలో తానిట్లనుకొన్నాడు 'దహనభూమి, మేకపిల్ల—ఈరెండు నాజీవితాన్ని పూర్తిగా మార్చివైచినవి. అప్పుడు నక్షత్రాలు, ఆకాశం, వింతరూపం దాల్చినవి.'

రెండువత్సరములనుండి విస్మృతికుహరమున నడగియున్న భూతకాలచరిత్ర ఒక్కసారిగా తనంతతానే పుటలు త్రిప్పు కొన్నది. ఎందుకొరకు ?—

రాధారమణకు అకస్మాత్తుగా తన జీవితపరమావధి స్మృతికి వచ్చినది. పరుగిడి వచ్చుచున్న భావములను కోపముతో తరిమి వైచినాడు.

పతివదనమున భావపరివర్తనముగాంచి రమణీమణి ఇంగ్లీషున 'ఏమిటి ఆలోచిస్తున్నారు ?' అన్నది.

రమణ నవ్వుచు ఇంగ్లీషున 'బిలవెడ్ బెస్ ! హృదయాలకు భేదంలేనప్పుడు నాకు రహస్యమన్నేది యెలాఉంటుంది. ఇప్పుడే నీకు చెప్పుదామనుకుంటున్నాను. ఇంతలో అడుగుట కలిగినది'

మోటారు నిశ్శబ్దముగ పరుగిడుచున్నది.

౨

మైలాపూరులో మనోహరోద్యానమునడుమ సుందరభవనము. భవనమంతయు క్రొత్తరకపు వస్తువులతో నలంకరింపబడి యున్నది. భారతదేశమున లభించని వస్తునిచయము— యూరపులో కష్టముపై దొరకు సుందరవస్తువులు ఎచట నెచట నేవియుండవలెనో నచట నచట బెస్ మృదులహస్తములతో నుంచబడి కనులపండువుగ నున్నవి.

పరిమళవిలసిత తోయములతో స్నానముజేసి అప్పుడే స్నానపుగదినుండి బయిటకువచ్చిన రాధారమణ చేతులలో

మనోజ్ఞముగ నేర్పరుపబడిన గులాబిపూవులగుత్తె బెస్ యుంచి చిఱునవ్వు నవ్వినది. .

బెస్ 'డ్రెస్సింగు గదిలో దుస్తులుంచినాను రండి'

రమణ ఆమె కోమలకరపల్లవమును బట్టుకొని గదిలోనికి వచ్చి ప్రభాతకాలపు వస్త్రములు ధరించినాడు. బెస్ తాను ఫ్రేన్సుదేశమునుండి తీసికొనివచ్చిన పన్నీరు రమణ కేశములపై జల్లి మెల్లగా తలదువ్వినది.

బెస్ 'కాశ్మీరత్నం పొదరింటిలో పడకకుర్చీ వేయించినాను. కాఫీతీసికొని వస్తాను మెల్లగా వెళుతూ ఉండండి'

రమణ 'ఇప్పుడప్పుడేవద్దు డియర్! మిత్రుడువచ్చిన తర్వాత మనము ముగ్గురము కూర్చుండి ఆరగించుదాము. నేనువెళ్లి అక్కడ కూర్చుంటాను. ఈలోపుగా పయోనా వాయించు' అని గులాబిపూలగుత్తె పట్టుకొని ఒయ్యారముగ నడుగులిడుచు ఉద్యానవనము—'ఆనందనిలయము' ప్రవేశించినాడు.

భవనముచుట్టును విశాలమైన ప్రదేశమున్నది. అందు ప్రహరీగోడ లోపలిభాగముచుట్టును కొబ్బరిచెట్లును, వానికి అయిదుగజముల దూరమున బొగడచెట్లువరుస, తరువాత మామిడిచెట్లు, పిదప వేపచెట్లు, ఆవృక్షశ్రేణికి కొంతదవ్వున అనేకరకముల లతలు, గులాబిచెట్లునున్నవి. మధ్య చక్కని చిన్నిబాట లేర్పరుపబడియున్నవి. ఒక పెద్ద వేపచెట్టుకొక

ఉయ్యేల వ్రేలాడుచున్నది. దానికి సమీపమున చంద్రకాంత శిలావినిర్మిత వేదికలు రెండున్నవి.

రమణ తిన్నగా నొక వకుళవృక్షము దగ్గరకువెళ్ళి సున్నితముగా బొగడపూవులు సేకరించుచు ఇట్లనుకొన్నాడు.

'పరమేశ్వరుడు ఈ పూలు ఊరికే సృష్టించలేదు' వెంటనే అతనిలో మఱియొకవ్యక్తి—రూపరహితమైన వ్యక్తి యుదయించి యిట్లన్నది 'అవును నిజమే! వీటిని ఆనందముకోసము సృష్టించాడు. పరమేశ్వరుడు తన ఆనందము కొరకేకాదు. తన పిల్లల ఆనందముకొరకు — సచేతనములు, అచేతనములు అయిన బిడ్డలకోసము. సృష్టించాను, తనివిదీరా ఆనందించండి అన్నాడు'

'జీవులకు విచారము కలిగితే ఏమిచేయవలె?'

'విచారమా: ఈప్రపంచంలో విచారమెక్కడుంది. విచారమనేది లేనేలేదు. ఒకవేళ జీవులు పరమేశ్వరుడు సృష్టించని విచారాన్ని తాము సృష్టించుకొన్నా, వెనకనుండి ఆనందమూర్తి చెప్తూనే ఉంటాడు. ఏమని? 'నేను ఇందుకోసము సృష్టించలేదు మిమ్మల్ని, ఈవస్తువుల్ని. విచారము కల్పించుకొని పాడైపోకండి. విచారంలోకూడా ఆనందం అనుభవించండి. అంతటా ప్రసరించిఉన్న ఆనందామృతం గ్రోలండి. ఇందుకొరకే మీరు సృష్టింపబడ్డారు.'

రమణ హృదయాంతర్గతమున జరిగిన సంభాషణ పూర్తైనది. ఒక్కసారి నలుదిక్కులు దేనికొరకో వెదకుచున్నట్లు

చూచి నాడతడు. దేదీప్యమానముగా వెలిగిపోవుచున్న ఆకాశము కేసి కూడ చూచినాడు. మరల బొగడపూలు తిలకించినాడు.

'నాకీసందేహము యెందుకు కలగవలె? ముమ్మాటికి నిజము. పరమేశ్వరుడు ఆనందముకోసం సృష్టించాడు ఈలోకము, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, నక్షత్రాలు, ఆకాశము—ఇవన్నీ అందుకే. నామేకపిల్ల చెప్పనేచెప్పిందీసంగతి నాలుగేళ్లక్రిందట. నాప్రియమైన దేవి శ్మశానమునుంచి ఈ విషయమే చెప్పింది. ఇది ఈనాటి క్రొత్తసంగతికాదు.'

బొగడపూలు పరిమళ మానందముతో నాఘ్రాణించుచు కాశీరత్నము పొదరింటిలోనికి వెళ్లినాడు రమణ. అచట నొక పడకకుర్చీ, ఒక మేజాచుట్టు నాలుగు మామూలు కుర్చీలు నున్నవి. మేజాపై తెల్లని వస్త్రము—దానిపై గాజుతొట్టెలో వివిధవిధసుమములు నమర్చబడియున్నవి. వానిప్రక్క నొక లవండరుసీసా యున్నది. అతడు పడకకుర్చీలో నాసీనుడై గులాబీ పూలు మేజాపైనుంచి, బొగడపూలు వాసనచూచుచు లవండరు పైన జల్లుకొన్నాడు.

టెస్ దొరసాని పమోనాపై మధురకంఠమెత్తి పాడుచున్నది. ఆతని హృదయమున ఆనందసరోవరముప్పొంగినది. తరంగములు మధురగానమునకు శ్రుతికలిపినవి. ఉద్యానమందలి వృక్షములు, తీగెలు అన్నియు నానందముతో నాలకించుచున్నట్లున్నవి.

ఆతడు పడకకుర్చీలో కొంచెముసేపు పరుండి మరలలేచి గులాబిచెట్లవద్దకు వెళ్లినాడు. ఒక పువ్వుగోసి 'నీవెందుకు వచ్చావు ఈ ప్రపంచములోకి? నాకోసమా నా బెస్ కోసమా—కాదు, అవును—ఆనందముకోసము, బెస్ మృదుల హస్తాలలంకరించడానికి.' అనుకొని, యింకగొన్ని పూలు గోసినాడు.

'పొండి మీరు ఆమధుర సంగీతముతో మిళితమయి పోవండి. మరల మీతల్లి, భూదేవిదగ్గరకు వెళ్ళవద్దు బెస్‌దగ్గరికి వెళ్లి ఆనంద డోలికలలో ఊగండి. ఆనంద మనుభవించండి'

పసిపాపవలె నవ్వినాడతడు. తన అమాయికపుస్థితి చూచి తనకే నవ్వువచ్చినది. మరల నవ్వినాడు. ఆచిఱునగవులో నుదయించిననవ్వు గులాబిపూలలో సమ్మిళితమై పోయినది.

గులాబిపూలు పట్టుకొని బెస్ ఉన్న గదిలోనికి వెళ్లినాడు. పూవులొకచోనుంచి ఆమెకు తెలియకుండగనే వెనుకవైపు నుండి వెళ్లి కనులుమూసినాడు. బెస్ నవ్వినది.

'నాకు తెలుసు మైడియరెస్టు' చేతులుతీసి గులాబిపూలామెకిచ్చి

'నాకూ తెలుసు నీవు నాడార్లింగుబెస్సీవని' అన్నాడు. బెస్‌కు తెలియకుండగనే సంగీత మాగిపోయినది. ఇరువురును కలిసివచ్చి యుయ్యేలపై నాసీనులైనారు.

రాధారమణ కుడివైపునున్న ప్రేయసి సన్నని నడుము చుట్టును దక్షిణ హస్తమునుంచి యెఱ్ఱని లేతపెదవులను

విలోకించుచున్నాడు. ఆ కోమలాధరోష్ఠముల లాలిత్యమును, విన్నాణమును, మనోహర రక్తవర్ణమును, వంపులను దిల కించుచు నానందపారవశ్యమున నాతడు మైమరచిపోయినాడు. అన్నిటికన్న ఆచిగురుటాకు పెదవుల వంపులు, వంపులలోని సౌందర్యము నాతనిని తన్మయానందుని జేసివైచినవి.

3

అట్టి యానంద సమయమున మోటారువచ్చి భవనము ముందట ఆగినది. మోటారు చూచి త్వరితగతి రాధారమణ, టెస్ వెళ్లి రాఘవస్వామి యెదుట నిలువబడినారు.

రమణ మిత్రునితో హస్తచాలనముజేసి యిట్లన్నాడు 'ఈమె మిసెస్ రమణ'

టెస్ షేక్ హేండు చేసిన తర్వాత వారు కాశ్మీరత్నము పొదరింటికి బయలుదేరినారు. ముఫ్వురు నాసీనులైరి. రమణ సేవకుని నిమిత్తము మేజాపైనున్న గంట నొక్కినాడు. సేవకుడు పరుగునవచ్చి అచేతనునివలె నిలువబడి 'సార్' అన్నాడు.

రమణ 'మాముగ్గురికి కాఫీ తీసికొనిరమ్మని చెప్పు బట్లరుతో'

వాడు వెళ్లిపోయినాడు. రమణ ప్రేయసివైపు తిరిగి 'ఈతడు నాపూర్వస్నేహితుడు. ఇతను నేను బి. యె. క్లాసు కలకత్తాలో చదువుకున్నాము' అని మిత్రునామె కెరుకజేసినాడు.

టెస్ చిఱునగవుజేసి యూరకున్నది. అప్పుడామె యధరము కదలక పైపెదవిమాత్రము కొంచెము కదిలినది. రమణ ముచ్చటైన ఆచిన్ని నోరుగాంచి యానందించినాడు.

రమణ మిత్రునిజూచి 'ఆమె పేరు టెస్. అంటే థామస్ హార్డీ నవలలోని టెస్ కాదుసుమా' అన్నాడు.

టెస్ ఆఫ్‌ది డర్బర్ వెలీస్ నవల స్వామి, టెస్ యిదివఱకే చదివియుండుటచే అందరు కలిసి నవ్వినారు.

ఇంతలో బట్లరు కాఫీ తీసికొనివచ్చి మేజాపై బెట్టినాడు. టెస్ నిలిచి పళ్లెరములు, పాత్రలు నమర్చినది. ఫలాహారము మెల్లగా నారగించుచు వారుముగ్గురు నెన్నో విషయములను గూర్చి ఆనందముతో ముచ్చటించుకొన్నారు.

రమణ సతీమణి నగుమోము గాంచి 'నిన్న నేనుచేసిన వాగ్దత్తము జ్ఞాపకముందా?' అన్నాడు.

టెస్ 'ఉంది. ప్రారంభముచేయండి మీచరిత్ర. మీచరిత్రతోపాటు టెస్ చరిత్ర కూడా రాదుకదా'

రమణ 'అవశ్యం వస్తుంది. కాని ఈచరిత్రకు, టెస్‌కు ఏకత్వం యేర్పడుతుంది కథలో కూడాను. ఎందుచేతనంటే చరిత్రకు పరమావధి టెస్ గనక. నదీప్రవాహము అనంతసముద్రగర్భంలో కలసిపోవునట్లు—కాదు—నీలమేఘము అనంతమైన ఆకాశములో సమ్మిళితమయి వ్యాపించిపోవునట్లు—ఈచరిత్ర, భావాలు, ఆదర్శాలు, ఆనందము అన్నీ టెస్

అనంత మధుర సౌందర్యంలో సమ్మిళితమైపోతాయి. అంటే యిక అక్కడ ఏకత్వమే కాని భిన్నత్వము లేదు.'

బెస్ హృదయేశ్వరుని తర్క ప్రావీణ్యతకు నవ్వుచు స్వామి వైపుజూచి 'మీరు కూడా ప్రోత్సహించండి' అన్నది.

స్వామి 'ఏది రమణ, నిరాకారమునకు ఆకారమిచ్చి వేదాంతివి కావోయి'

రమణ గొంతు సవరించుకొని హృదయేశ్వరి ముద్దుమోము గాంచి 'మొదలుపెటుతున్నాను' అన్నాడు.

బెస్ 'మీరు వేదాంతి మాత్రము కావద్దు—కథకులు కండి'

రమణ 'అది యెల్లాగు! వేదాంతానికి నాకు బద్ధవిరోధము. కథకుణ్ణి అవుతూ గులాబిపూవును కూడా అవుతాను అంటే పూవు నిశ్శబ్దమై యేమిబోధచేస్తుందో నేను అపనే చేస్తాను'

బెస్ 'అయితే కానీయండి. గులాబిపూవుకు నాకు చాల రోజులనుంచీ ప్రాణస్నేహము'

రమణ 'అయిదేళ్లక్రితము కలకత్తాలో బి. యె. క్లాసు చదువుచున్నప్పుడు నేను, ఒక స్నేహితుడు సాయింకాలము గంగాతీరమున షికారు వెళుతున్నాము. ఆవలి ఒడ్డుకు వెళ్ల వలెనని బుద్ధి పుట్టింది. ఒక చిన్ని పడవ యెక్కి తీరము చేరి అచటనే యున్న ఒక సన్యాసాశ్రమము చేరుకున్నాము. ఆ గుడిసెలో మహాజ్ఞాని అయిన సన్యాసి ఉన్నాడని యిదివరకే

విని వుండడము వల్ల ఆతన్ని సమీపించి నమస్కరించి కూర్చు న్నాము. మేము వచ్చిన పనేమిటని సన్యాసి అడుగగా యేమీ లేదని చెప్పి అరగంటసేపు మౌనంగా కూర్చున్నాము.'

స్వామి 'మౌనమంటే కనులు మూసుకొనేనా'

రమణ 'లేదు—'

అందరు నవ్వినారు.

బెస్ 'ఎందుకంతసేపు కూర్చుండుట?'

రమణ 'ఏదైనప్రశ్న అడుగుదామని అనుకునేవాణ్ణి కాని సిగ్గు. ఎల్లాగైతే ధైర్యముచేసి యీవిధముగా అడిగాను' ఒకటితర్వాత ఒకటి వెంటవెంటనే "మనుష్యుడు పాపాలు చేస్తే ఈజన్మలోనో లేక మరొక జన్మలోనో అనుభవిస్తా డంటారు. ఎందు కనుభవించాలి. వీళ్లకు బుద్ధియిచ్చింది పర మేశ్వరుడేకదా. తానిచ్చిన బుద్ధితోనేకదా వీళ్లేపని చేసినను. ఇక పాపమెల్లా అవుతుంది. ఈమాత్రముదాని కింకో జన్మ యెందుకు. ఇల్లా జన్మ లెత్తించడము వీళ్లకు ఉత్తమ జన్మ యివ్వడానికా, ఇప్పుడు చేసిన పాపాలయొక్క ఫలము మరల జన్మలో అనుభవించ డానికా, మొదటి దానికోస మెత్తిన రెండో జన్మలో ఇంకాకొన్ని పాపాలుచేస్తే వాటి పరిహా రార్థము ఇంకొక జన్మ యిల్లాగే అనేక జన్మలు కలిగిస్తాడా? జంతువు పుట్టుక పుట్టి మరల మానవ జన్మయెత్తి, ఈమానవ జన్మలో పాపముచేస్తే మరల పశు జన్మకువెళ్లి ఏమిచేస్తాడు? ఇన్ని విధాల జన్మలు ఎందుకు? మానవ జన్మలోఉన్న ఎక్కు

వేమిటి? పరమేశ్వరుణ్ణి తెలిసికోవ డానికి అవకాశా లున్న వంటారు. ఇన్ని అవకాశా లుండగా ప్రపంచము పుట్టి యిన్ని వేల సంవత్సరాలైతే నేటికి పరమేశ్వరుణ్ణి గురించి మానవులు తెలిసికో గలిగిన మహాద్భాగ్య మేమిటి. అతన్ని తెలిసి కుంటే, అతనీ జీవులను యిన్ని కష్టాలెందుకు పెడుతున్నాడో యెవరైనా చెపుతారా? ఈప్రపంచము కొన్ని వేల సంవత్స రాలుండి తర్వాత ప్రళయములో కలిసి పోతుందంటారు, నిజమేనా? అల్లా కలియడ మెందుకు? తన్ను కలియ వలెనని దైవముయొక్క ఉద్దేశమైతే, తాను జీవులకిచ్చిన కించిన్మాత్ర వివేకముతో పరీక్ష యెందుకు? వీళ్లకు బుద్ధి యింత తక్కువ యిచ్చి ముందుముందు యెక్కువ చేస్తాడా? ప్రపంచము పుట్టి నప్పటికి ఇప్పటికి మానవునిలో యేమాత్రము వివేకాభివృద్ధి కనిపించినది? దైవమే మనలను వెనకనుండి నడిపించు చున్నా డంటారుగదా? తాను వెనకనుంచి మనలను నడుపుచు తన దగ్గరకే తీసికొని వెళ్తాడా? తాను సృష్టించిన కించిన్మాత్రు లతో దాగుడుమూతలాట ఆడుచున్నాడా?" ఎవో యిటు వంటి ప్రశ్నలు అనేకము లడిగినాను.

లెస్ ఆశ్చర్యాన్విత దృక్కులతో పతిని గాంచినది. ఆమెకీ మాటలలో నొక్కటియు బోధపడినది కాదు. ఆవిషయము రమణ కనిపెట్టి యే ప్రశ్నలు తగ్గించి వైచినాడు.

సతీమణి యాశ్చర్య భావమును దెలిసికొని రమణ తనలో నిట్లనుకొన్నాడు 'సౌందర్యోపాసకులకు ఇట్టి ప్రశ్నలేమి అర్థ

మవుతవి. అర్థము కావలసిన అవసర మేమిటీ ఆనంద తన్మయు లకు, ఆనంద మూర్తులకు? సౌందర్యానందమును, మధుర ప్రేమై కానందమును అనుభవించుటే వారిపని. ఇంకో విష యము వారి కవసరములేదు.'

బెస్ నవ్వుచు 'తర్వాత ఏమిచేశారు?' అన్నది. రమణ 'ఒక్క ప్రశ్నకు కూడా జవాబు చెప్పినాడు కాదు. మఱు నాడు రమ్మన్నాడు. మఱునాడు వెళ్లుట కిష్టములేక పోయి నను ఏదో శక్తి అటువైపు లాగుకొని వెళ్లినది. రెండవసారి అచటికి వెళ్లకముందు అతన్ని గురించి మరల భోగాట్టాచేశాను. అతడు మహాత్ముడనీ చాలామంది ఇంగ్లీషు విద్యావంతులు శిష్యులున్నారనీ చెప్పారు. సరేగదా అని నేనొక్కడనే వెళ్లి నాను. నా ప్రశ్నల కేవో వెర్రిసమాధానాలు చెప్పాడు నేను బాలుణ్ణి అవడముచేత, నాకు లోకానుభవమంతగా లేకపోవ డమువల్ల యిటువంటి ప్రశ్నలు వేస్తున్నానన్నాడు. దానిపై నాకు కోపము వచ్చినది. కోపము రాదామరి. తను వృద్ధు డయి, లోకానుభవము సంపాదించి నా ప్రశ్నలకు చెప్పగలిగిన సమాధాన మేమిటి? చాలా కోపమువచ్చి పళ్లు పటపట కొరికినాను'

ఆత్రముతో నాలకించుచున్న బెస్ పతినిగాంచి నవ్వుచు "కోపమువచ్చి యేమి చేశారు? పాపము ముసలిసన్యాసిని కొట్టలేదు కదా!" అన్నది. రమణ "లేదు. నాకు యిరు వయి సంవత్సరాలున్నవి. మీాకు అరవయి వయస్సు. ఏమి

ప్రయోజనము? సరియైన సమాధానములు చెప్పలేక వయస్సు చిన్నదనడములో ఏమి న్యాయముంది. ఈ ప్రపంచములో ఎక్కువ సంవత్సరములు జీవించడమువల్ల కఠినమై పోయిన మీా మేధస్సుకు ఇటువంటి కోమలమైన ప్రశ్న లేమి అర్థమవుతవి?" అన్నాను ఉద్రేకముతో. ఆ సన్యాసి శాంతముతో "పదినిముసాలు మౌనము వహించుబాబు" అన్నాడు. పావుగంట నేపూరకున్నాను. తర్వాత అతడు మెల్లగా లేచి నన్ను సమీాపించి నా యెదురొమ్ముపై చేయివైచి మెల్లగా తీసికొన్నాడు. నాకు అప్పుడు చాలా భయమయినది. కంపితస్వరముతో 'నన్నేమిచేస్తున్నా' రన్నాను. అతడు మాటాడలేదు. అప్పుడు నేను మెస్మరిజము చేసివైచినట్లైపోయినాను. ఆ ఉద్రేకము,ఆప్రశ్న పరంపర విచిత్రముగా అణిగిపోయినవి. నాచుట్టు శాంతమయ వాతావరణ నాకు తెలియకుండగనే యేర్పడింది. అతడు నా ముందరకూర్చుండి "బాబూ, భక్తికున్న ప్రభావము జ్ఞానానికి, తాంత్రికశక్తులకు లేదు. పరమభక్తివల్లనే మనము మన పరమావధి సాధించవలిగాని ప్రజ్ఞానమువల్ల, ప్రశ్నలవల్ల మంత్రతంత్రమువల్ల ఉపయోగములేదు. నాయనా! నినాదముచేస్తూ పూవుచుట్టు తిరిగే తేనెటీగ నెప్పుడూ చూడలేదూ? అది మకరందము గ్రోలునపుడు నిశ్శబ్దలయియే ఉంటుంది. అల్లాగే నీ ప్రశ్నలూను. ఆ కాళీమాత దయవల్ల నీ హృదయాకాశములో భక్తి సూర్యోదయిస్తే ప్రశ్నలనే తిమిరములు పటాపంచలై పోతాయి." అన్నాడు. తర్వాత ఏదో

మంత్రము చెవిలో చెప్పి దాన్ని స్మరించుకొని మఱునాడు రమ్మన్నాడు.'

బెస్ ఉద్విగ్నచిత్తముతో వినుచున్నది. అప్పు డామె చిన్ని నేత్రములు నవ్వుచున్నవి. ముందేమి చరిత్ర వచ్చునో యని ఆమె యాత్రహృదయయై పతివంక నిశ్చలనయనయై చూచినది.

స్వామి 'ఆమంత్ర మేమిటో మాకు చెప్పకూడదా రమణ'

రమణ 'అట్టి అభ్యంతరమేమీ లేదు. దానివల్ల మీకు ప్రస్తుతము ప్రయోజనము లేకపోవునప్పటికి చెప్పుమనుటచే చెప్పుతున్నాను. అది మరేమీ కాదు. నీకు తెలిసినదే, ఓం— మఱునాడు సాయంకాలము కాలేజీనుండి తిన్నగా అచటికి వెళ్ళినాను. ఈరోజు చాలా ఆతురతతో అప్పటి నామానసిక గురుదేవుని సమీపించినాను. సాష్టాంగపడి నమస్కరించవలె నని బుద్ధి పుట్టినది. అల్లాగే నమస్కరించాను. అతడు శిరస్సుపై చేయివైచి ఆశీర్వదించినాడు. ఏమని దీర్ఘాయువు కలుగవలెనని కాదు. "కాళీమాత సాక్షాత్కరించవలె"నని, బోధ ప్రారంభించినాడు. ఒక్కొక్కమాట విద్యుత్ తరంగమువలె సమీపించి నాహృదయమును ఊపివైచినది. సంపూర్తిగామారిపోయినాను. మరల వెళ్లిపోవునప్పుడు సాష్టాంగనమస్కార మాచరించాను. అప్పుడు—భూమిపై పరుండి యున్నప్పు డొక ప్రకాశమానమైన దివ్యజ్యోతి కనిపించినది. ఆమహాజ్యోతిలో సమస్తలోకములు గిరగిర తిరిగిపోతూ ఉన్నవి. ఒక్కనిముసమే

నాకాజ్యోతి కనిపించినది. మెల్లగా లేచి వెళ్లిపోయినాను. బయిట అడుగు పెట్టునప్పటికి ప్రపంచము వేరురూపముతో గోచరించినది. అంతా యెదో ప్రకాశము వ్యాపించినట్లు స్ఫురించినది. ఆప్రకాశ మేమిటో స్వగృహము చేరేసరికి పూర్తిగా బోధపడింది. తల్లి సాక్షాత్కారమయినది. సమస్త వస్తువులలోనూ ఆమె కనిపించినది, జంతువులు, ఉదకము, చీమ, దోమ, ఆకాశము, నక్షత్రాలు, చంద్రుడు తల్లిలాగునే —కాళీమాతవలెనే గోచరించినవి. వెర్రివానివలె అన్నిటికి నమస్కరించాను మనస్సులో, మహత్తరమైన మార్పుకలిగినది. ఈమాటలు చెప్పుచున్నప్పుడు రాధారమణ వదనము పూర్తిగా మారిపోయినది. అప్పటి యాతని ముఖభావము గాంచి లలిత హృదయ బెస్ వణికిపోయినది. అప్పుడామె కతని యానసము తక్క నన్యము కాన్పించలేదు. కొంతసేపటికి బెస్ సేదదీరి 'అబ్బా, పావుగంటసేపు మీకథ ఆపుచేయండి, చాల భయంకరముగా ఉన్నది. సన్యాసి నాకొరకే పుట్టినట్లున్నాడే' అన్నది.

రమణ ప్రేయసి కరపల్లవము కేలగీలించి నవ్వుచు 'బెస్ భయపడకు. ఇందులో భయమేమున్నది. చివరకీ కథను నీలోనే ఐక్యమొనర్చుతానని చెప్పినాను కదా! ఈచరిత్ర నీ అనంతసౌందర్యమునకు— అనుపమాన లాలిత్యమునకు— అవ్యాజప్రేమనిధికి యిదివరకే అంకితమయిపోయినది. భయపడెదవనియే నీకెప్పుడు ఈకథ చెప్పియుండలేదు' అన్నాడు.

అప్పుడు స్వామి కనుపాపలో నానవదంపతులిర్వురు నొక్క రూపముగా గోచరించినారు.

కొంతదనుక ముమ్వురు మౌనముద్రితులై యున్నారు.

రమణ 'డియరెస్టు, ప్రథమ భాగము త్వరలోనే పూర్తి చేస్తాను. భయములేదు విను. తర్వాత అతని దగ్గరకు చాల సార్లు వెళ్లినాను. నాఆవేశము దినదినము పెరిగి పోయినది. ఎల్లప్పుడు, ప్రతివస్తువులోను కాళీమాతను జూచి ఆనందించి నాను. పరీక్షలైన తర్వాత స్వగ్రామము వచ్చివేసినాను. పూర్తిగా మారిపోయిన వ్యక్తినిజూచి మావూర్లోవాళ్లంతా ఆశ్చర్యపోయారు. ఇదివరలో వస్త్రాలంకారమునకు, సౌందర్య మునకు అంకితము చేయబడిన శ్రద్ధాభక్తులు మాతృదేవి నానందించడమునకు మరలిపోవుటచేత, వేషభాషలు సంపూర్ణ ముగా పరిణామ మంద్ధిపోయినవి. ఇదివరకెప్పుడు పట్టువస్త్రాలు ధరించే శరీరము మాతృదేవి ప్రకాశముతోకూడిన మామూలు వస్త్రములతోనే అమందానంద మందినది'

స్వామి 'అన్నట్లు విద్యార్థి జీవితములో మీస్వగ్రామము కనుక్కోవలసిన అవసరమే కనిపించలేదు. ఇపుడు రవంత గృహస్థులమైనాము గనక—మీఊరు పేరేమిటి, రమణ!' అస్ నవ్వుచు 'నన్నడిగితే నేను చెప్తాను కదా! ఈభయం కరమైన కథ తెలియకపోతే తెలియకపోవచ్చు కాని యీ మాత్రపు విషయాలు గ్రహించకుండా ఉన్నాననుకున్నారా? పిఠాపురముదగ్గర పల్లెటూరు. ఆజమీందారీ వీరిదే' అన్నది.

స్వామి 'అటులనా! విద్యార్థిజీవనములో యీపూసే లేక పోయినది'

రమణ 'ఆసంవత్సరము బి.యె. క్లాసు ప్యాసు అయ్యేదనని యాఢిగా తెలిసిన సంగతి. అంతవరకు మాజమీా అజమాయిషీ చేస్తూఉన్న మేనమామ సమస్తము నాకొప్పగించినాడు. ఇక యింటిదగ్గరనే వుండి జమీా స్వయముగా చూచుకోవడానికి నిశ్చయించుకొన్నాను. అంటే ఆయావేశము తగ్గలేదు. దేవీ సాక్షాత్కారము సర్వవేళల, సర్వవస్తువులందు ఉంటూనే వుంది. అన్నట్టు కథచెపితే పూర్తి వివరములతో చెప్పవలి. ఆస్తిసంగతికూడా చెప్పమంటావా యేమిటి స్వామీా!'

స్వామి 'ముఖ్యంగాను'

రమణ 'చిన్నజమీా, భూములు, తోటలు ఉన్నవి. వీని మీాద సంవత్సరమున కాదాయము ముప్పయివేలు'

స్వామి 'అవును, ఇంత ధనాగారమున్నప్పు డింకా చదు వెందుకు. ఈమాత్రపు యింగ్లీషు చదువు బి. యె. వరకు చదివితే చాలదా?'

రమణ 'అప్పుడు చదువు మానుటలో నాయుద్దేశ మది కాదు. ఆస్తి నాచేతుల్లోకి వచ్చేవరకు నాకింత ఉన్నట్లు తెలి యనే తెలియదు. కాని నేనంతకుముందే నిశ్చయించు కొన్నాను, భక్తిజీవనము గడపవలెనని.'

స్వామి 'బాగుంది. కాని ఈమార్పు యెట్లు వచ్చిందోయి' అని టెన్‌వైపు చూచినాడు.

రమణ 'అదే చెప్పబోతూ వున్నాను. ఆనందమూర్తి అయిన పరమేశ్వరుడు మన ఆనందముకోసము మనజీవితములో విచిత్రమైన మార్పులు కలిగించుతూ 'ఆనంద మనుభవించండి' అంటే మనకాబోధ అర్థముకాదు. అర్థమైనదా ధన్యులమవుతాము. ఆవిధముగ లోన పైన దేవీసాక్షాత్కారము చేయుచున్న నాకు యింకొక క్రొత్తవిషయముతో పరిచయము కలిగినది. ఇదంతా విచిత్రమోయి, స్వామి!'

స్వామి 'ఊం'

రమణ 'నాకొక్కతె చెల్లెలు. మరచినాను. తలిదండ్రుల ప్రేమామృత మనుభవించే అదృష్టము నాకు చిన్నతనములోనే లేకుండా పోయినది. ఆచెల్లెలంటే నా కమితమైన ప్రేమ. కాని దురదృష్ట వంతుడ నోయి నేను. ఆమెకూడా లేకుండా పోయినది. శ్మశానభూమిలో ఆ నాప్రేమైక నిధిని—సుకుమారమూర్తిని అగ్నిలో చూచి గుండె బ్రద్దలై పోయినది. అదివరకు దహనభూమి యెన్నడు చూచి యెరుంగని నాకు కన్నీరు ఏకధారగా ప్రవహించినది. ఆసుకుమా రావయవములు—నా చెల్లెలి ముద్దుమోము, వంపులు తీరిన కేశపాశములు జ్వాలలలో గాంచి' తల్లీ, నీవెంత ప్రేమైక స్వరూపిణివో అంత కఠినాత్మురాలవు. అందుచేతనే నిన్ను లోకము క్రూరాత్మురాలివలె సృష్టించినది, అనుకొన్నాను. కాళీమాత సాక్షాత్కారమునకు తోడు వైరాగ్యము జతకుదిరినది. ఇక అప్పుడు నాస్థితి యేమి చెప్పను. ఉన్మత్తుడ నై పోయినాను.'

బెస్ 'అదిగో, మీరుమరల భయంకరమైన విషయాలు చెప్పుతున్నారు.'

రమణ ఆమె అమాయికపు మోము—చూపులు గాంచి జాలితో 'బెస్, ఏమిభయ మున్నది' అన్నాడు.

బెస్ లవండరు సీసా గైకొని హృదయేశ్వరునిపై చిలుక రించినది. రమణ బెస్ పైనను, స్వామిమీదను జల్లినాడు.

స్వామి నవ్వుచు 'రమణ, అప్పటి నీస్థితి యేనుగుతో దెబ్బలు తినిన వెర్రిభక్తునివలె కాలేదుకదా' అన్నాడు.

రమణ ప్రత్యుత్తరముగా నవ్వినాడు.

బెస్ ఆత్రముతో 'అదేమిటి. ఏనుగు యెవరిని కొట్టినది?—' అన్నది.

స్వామి 'ఈ కథకూడా విచిత్రమైనదే. ఒక గురువు శిష్యునితో ప్రతివస్తువులోను పరమేశ్వరు డున్నాడని చెప్పినాడట. ఆ వెర్రిభక్తుడు ఆమాట హృదయ పూర్వకముగా నమ్మినాడు. తర్వాత త్రోవవెంబడి అతడు వెళ్లుచున్నాడట. ఒకఏనుగు యెదురుగా వచ్చుచున్నది. శిష్యుడు తనలో "నేను పరమేశ్వరుణ్ణి, ఏనుగు పరమేశ్వరుడు. ఇదినాకు హానిచేయదు, అనుకొని దాని కెదురుగా వెళ్లినాడు. ఏనుగు ఊరుకుంటుందా? తొండముతో గట్టిగా కొట్టినది. అతడు దెబ్బలుతిని గురువు దగ్గరకు పరుగెత్తి "మీరు చెప్పిన మాట అబద్ధము. ఏనుగు దేవుడైతే నన్నెందుకు కొట్టిం" దని తనకథ చెప్పినాడు. అప్పుడు గురువు వాని తెలివితక్కువ తనం తెలిసికొని" మావటివాడు

తప్పుకోమని చెప్పివుంటాడు. ఆదేవునిమాట యెందుకు విన లేద” న్నాడు. ఈవిధముగ కాలేదుగదా అప్పటి నీస్థితి ?'

టెస్, రమణ పకపక నవ్వినారు. ఆనవ్వులో టెస్ భయ భావము లీనమై పోయినది. చాలసేపు వారునవ్వులో మునిగి పోయిరి.

టెస్ అనుమతిపై రమణ మరల స్వీయకథనము ప్రారంభము చేసినాడు 'నా చెల్లెలి మరణమువల్ల ప్రపంచ మశాశ్వతమనే భావము స్థిరస్థాయిగా నాహృదయ ఫలకముపై నాటిపోయినది. అప్పుడు నాభార్యకూడా తల్లిలాగానే కనిపించినది. ఒకసారి ఆమెను 'తల్లీ' అని సంబోధించాను కూడాను, వెర్రినై పోయి. పాపమా అమాయకురాలు ఆమాట విని ఏకధారగా కన్నీరు గార్చినది. కాని యేమిలాభము. నాభావ మామెకు బోధపడలేదు. ఆమె నా మార్పుచూచి దుఃఖించుచున్న సంగతి నాకు బాగా అర్థమయినది కాదు. కాని అప్పుడామె యేడుపు నా ఉన్మత్తతను నాకు కొంతవరకు యెరుక జేసినది.'

టెస్, మీరు భయంకరులండీ అని గంభీరభావము చాటున మెల్లగా నవ్వినది.

రమణ 'ఆమాట ఒకానొకప్పుడు నిజమే. అప్పుడు యితరులయెడ నాప్రవర్తన మరలించుకొన్నాను. ఎల్లప్పుడు యేకాంతముగ మామిడితోటలో కూర్చుండి యీవిధముగ నాలో నేను పాడుకొనెడివాణ్ణి'

'కనుగొన్ని సినుమది గానము జేసెడు
దినమది సుదినము కాదా
తల్లీ !
దినమది సుదినము కాదా'

నా వైరిధోరణి చూచి అనేకులు విచారించినారు. తమ ప్రయత్నములను తాము చేసినారు. కాని వారి ప్రయత్నములు వృధా కాలేదు. నావిరాగిభావము మెల్లగా మటుమాయమై పోయినది. దేవీసాక్షాత్కారము మాత్రము పోలేదు'

అప్పుడు పదునొకండు గంటలు కొట్టినవి.

బెస్ 'ఇప్పటికి చాలు. భోజనము వేళయినది. మిస్టర్ స్వామి, మీ రీరోజు యిచటనే భోజనము.'

రమణ 'అవును, ఈపూట కాపుచేస్తాను. సాయంకాలము ద్వితీయభాగము ప్రారంభము చేస్తాను.'

బెస్ 'అయితే ఆభాగములో యూరపు ప్రయాణము గురించి వస్తుందన్నమాట.'

రమణ 'దానికేముంది మేరి పిల్లసంగతి కూడా చెప్పవద్దా!'

బెస్ 'అవును, మరిచాను. ఈచరిత్ర నాకు తెలిసినదే.'

---

౪

రాధారమణ మధ్యాహ్నసూర్యప్రదీపితాకాశము శూన్య దృష్టితో నీక్షించుచు భవనము ముందునున్న సోపానములపై నిలుచుండి వరాండాలో పడకకుర్చీ యందుపవిష్టుడై మఱు నాటికి సంపాదకీయము వ్రాసికొనుచున్న స్వామివైపుజూచి 'స్వామి, సాయంకాల ఫలాహారమైన తర్వాత కథ సాగించు దాము. ఈ లోపున నీ పని చూచుకోవచ్చును' అన్నాడు.

ఏకాగ్రచిత్తముతో వ్రాసికొనుచుండిన స్వామి మిత్రుని జూడకనే 'అటులనే' అన్నాడు.

ఇంతలో రెస్ దొరసాని చుట్టును సన్నని జల్తారీ అంచుగల గులాబీరంగు పట్టుచీరె, తెల్లని జాకెట్టు ధరించి చేతనొక సంచి పట్టుకొని వరాండాలోనికి వచ్చినది.

స్వామి తలయెత్తి పరీక్షా దృష్టితో నామెను అరనిము సము వీక్షించి మరల తన పనిసాగించినాడు.

తెల్లని పట్టువస్త్రములు ధరించిన రాధారమణ, రెస్ కలిసి ఒకరి శరీరముచుట్టు నొకరు చేతులువైచికొని యుద్యాన వనము ప్రవేశించినారు.

నిశ్శబ్దముగ నాప్రేమైక మిధునము తోటచుట్టును గొంత సేపు దిరిగి వకుళవృక్షచ్ఛాయ నున్న శిలావేదికపై నొకరి కెదురుగ నొకరు ఆసీనులైనారు.

ఎవ్వరును మాట్లాడలేదు. రమణ విశాలనేత్రములను మఱింత విశాలపరచి యెదురుగనున్న ఉయ్యేలవైపు అర్ధ రహితదృక్కులతో నని మేషనయనుడై చూచుచున్న బెస్‌ను, (ఆకలిగొని యున్నట్లున్న) చూపులతో గభీరముగ జూచి నాడు. ఆ సుంద్రదని నునుపైన బాహులతలు, కంఠసీమ, వంపు దీరిన ఎర్రని పెదవులను, బంతిపూవువంటి చిన్ని చుబుకమును, నలుపు, ఊదా, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ ఏదియుకాక అన్ని రంగులు కలిసియున్నట్లున్న చిన్ని తీవ్రమైన నేత్రములను, అరటిదూటను మించిన లాలిత్యము గలిగిన చిన్ని బుగ్గలను, ఫాలభాగమును, తరువాత సన్నని మనోహరశరీరమును అర్ధ గంభీరమైన చూపులతో తృష్ణగొనియున్న ఆత్మ ఆయా యవ యవపాత్రలలో ప్రేమామృతమును గాంచినట్లు పిపాసావిమ లమైన దృక్కులతో చూచినాడు. మధురము, మంజులము, సుందరము, లలితము, మనోహరము నయిన దివ్యశరీరముతో దృష్టిదీరక, చూపులను లోన జొరనిచ్చి శరీరమును మించిన హృదయమునుగూడ ప్రేమైకవీక్షణములతో గాంచినాడు. ఇవన్నియు గాంచుచున్న రమణ మెల్లమెల్లగా తన్మయా నందుడై పోయినాడు. అతడటులే పావుగంటసేపు బెస్‌ను జూచినాడు. బెస్ శాంతమయ దృష్టితో యథాప్రకార ముయ్యేలను, ఎదురుగనున్న తీగెలను గాంచుచున్నది.

రాధారమణ చటాలున లేచి బెస్ సుంద్రదని భుజములపై మెల్లగా చేతులు నాన్చి, "డియర్, నీ సౌందర్యముతో నా

జీవితం వెలిగించి వేశావు" అని కోమలాధరముపై ముద్దిడినాడు.

టెస్ పతి సుందరవదనమును అర్ధములేని చూపులతో జూచినది.

'గులాబీపూలు పరచుతాను.' అని వెంటతీసికొని వచ్చిన సంచిలోనున్న గులాబీపూలు తీసి వేదికపై బరచి వానిప్రక్కతాను గూర్చున్నది.

రమణ మెత్తని గులాబిపూల శయ్యపై బరుండి మస్తకము ప్రేయసి నితంబముపై నుంచి దక్షిణహస్తముతో నామె చిన్ని చుబుకము పట్టుకొని, ముగ్ధమోము గాంచినాడు. అప్పుడే ప్రియుడన్న మాటలకు ప్రత్యుత్తరముగా నామె అర్ధగంభీరము కోమలమునైన దృష్టితో నాతని విశాలనేత్రముల లోనికి జూచినది. నయనాంతరమున నామె కేమి కనిపించినదో!

ఒకరి సౌందర్యమును ప్రేమను నొకరు తనివినయనములతో అవలోకించుచు వారిటులనే తన్మయులైయున్నారు. ఎంత సేపో వారికే తెలియదు.

రాత్రి రమణకు ముందుగా మెలకువవచ్చినది. 'టెస్సీ, నా ఆదర్శాలు, అనుభవము, సమస్తము నీలో లీనముచేసివైచాను' అన్నాడు.

విమలహృదయమైన టెస్‌కు ప్రత్యుత్తరమేమి యీయవలెనో తెలియలేదు.

రమణ 'ముఖ్యముగా నా పరమావధికి నీలేతహృదయ ములో చోటు దొరికింది' అన్నాడు.

ఆవేశముచే మెరిసిపోవుచున్న ప్రణయరసరంజిత నేత్రము లతో నామె ప్రియుని గాంచినది.

రమణ 'ప్రేమైకమూర్తి—ఆనందస్వరూపము అయిన పరమేశ్వరుడు దయతో నాకనేక విషయముల మూలముగా గొప్పగొప్ప పాఠాలు నేర్పినాడు. ఉదయము చెప్పానుకదా కొంత చరిత్ర. ఈ జీవితములో మార్పు విచిత్రముగా వచ్చి వచ్చి తుదకు నా గమ్యస్థానము—'

బెస్ ప్రియుని యావేశవాక్యములు వినజాలక సంభాష ణము మార్పు జేయవలెనను తలంపుతో 'గొప్పగొప్ప పాఠా లంటె జ్ఞాపకము వచ్చింది. నిజమే. పరమేశ్వరుడు చిన్నివిష యముల ద్వారా మనకు సాధారణముగా బోధపడని తన మహాతత్వము ఎరుకజేస్తూ ఉంటాడు. మనమా ప్రబోధము గ్రహించడములోనే మన అదృష్టము ఇమిడివుంది.' అన్నది. సంభాషణా పరిణామమున కభిలషించిన యామె ప్రయత్నము సఫలము కాలేకపోయినది.

రమణ 'సత్యం, బెస్సీ.'

బెస్ 'మీ కీసంగతి ఎప్పుడైనా చెప్పానేమో కూడాను. నా కిప్పటి కీ ఆదృశ్యము కళ్లకు గట్టినట్లుంటుంది. అప్పుడు నాకు పన్నెండు సంవత్సరాలు వయస్సు. నేను నా పినతండ్రి స్విడ్జర్లాండులో ఒకకొండపైకి ఎక్కుచున్న రైలులోఉన్నాము.

బండి మెల్లగా కొండపైకి వెళ్లుతూఉంది. మా కెదురుగ అప్పు డప్పుడే విడిపోతూ ఉన్న మంచు, గభీరమైన కొండలు, కొం డలచాటునుండి అప్పుడే కొంచెం కొంచెము కనిపిస్తూఉన్న సూర్యుడు, మంచును భేదించుకొని కొండకొండకు మధ్యనున్న మనోహరప్రదేశము ప్రవేశిస్తూ ఉన్న సూర్యకిరణాలు, పైన నల్లని మబ్బులు—ఎంతో ఆకర్షనీయముగా ఉన్నవి. దూరాన ఉన్న పట్టణము చిన్నపల్లెలాగు గోచరిస్తూఉంది. మతప్రచా రకుడైన పినతండ్రి ఆవేశముతో నా వంకచూచి 'టెస్స్, ఆ మనోహరమైన ఈశ్వరసృష్టిలోని సౌందర్యము చూస్తూఉంటే నీ కేమి స్ఫురిస్తూఉంది?' అని ప్రశ్నించాడు. నాకు వయసు తక్కువ. ఆకర్షనీయముగా ఉన్న ప్రకృతిదృశ్యము చూచిన కొలదీ చూడాలనే కోరిక కలిగింది నే నాతని భక్తిరసనిలయ ములైన వృూదారంగు కళ్లకేసి జవాబు చెప్పకుండానే—ఏమి చెప్పవలెనో తెలియక సగము భయముతోను సగము భక్తి తోను చూశాను. ఆయన ఆవేశముతో—తన ఆవేశము తెలియపరచడానికి తగినవ్యక్తి యింకొక రెవరూ అక్కడ లేక పోవడమువల్ల—నాతో ఇల్లా అన్నాడు. 'ఈమహా మధుర సౌందర్యమైన ప్రకృతిదృశ్యము చూస్తే పరమేశ్వరుడు లోకము ఆనందముకోసము సృష్టించాడని బోధపడుతూ ఉంది. టెస్, నేటికి నా సంశయాలు నివారణ అయినవి. మాధుర్యానికి, సౌందర్యానికి నిలయమైన ఆ దృశ్యము చూచిన చూపుతో దూరముగా ఉన్న పట్టణము చూడు. ఈ మనోహరదృశ్యా

నికి దానికీ పోలికా? పరమేశ్వరుడు లోకము ఇంత సౌందర్యముతో మాధుర్యముతో సృష్టించి మన ఆనందముకొరకు మనల్ని ఇందులో విడిస్తే—చూడు ఆపట్టణమువంక—మానవులు ధర్మాధర్మమనే భేదాలు, పాపపుణ్యమనే తారతమ్యము, కీర్తి అపకీర్తి అనే భ్రమ, ఇన్ని పెట్టుకొని తమ ఆనందము చెరుచుకోవడమే కాకుండా సృష్టియొక్క నిశ్చలానందమునకు కూడా కళంకము కలిగించుతూ ఉన్నారేమో అని భయము వేస్తూ ఉంది. డియర్, దేవుడు ఈ లోకమేమిటి ఏ లోకమైతే నేమి ఆనందము కోసము సృష్టించాడు. అతడు ప్రేమనిధి; అతనిసృష్టి ఆనందనిలయము. ఇందులో సంశయములేదు. మన మానందముకొఱకు సృష్టింపబడ్డా, మనల్ని మనమే చెరుపుకొని రోజురోజుకి ఆనందానికి దూరమైపోతూ ఉన్నాము' అన్నాడు. ఈ విషయము జరిగి పదకొండు సంవత్సరాలైనా, నా కామాటలు ప్రతిఅక్షరమూ ఇప్పటికీ జ్ఞాపకముంది.'

రమణ 'ఎప్పుడూ ఈ సంగతి చెప్పినావు కాదు. అయితే నీకు కూడా ఈ విషయాలలో ప్రవేశముం దన్నమాటే. లేకపోవడమేమిటి? ఔన్స్, మీ పినతండ్రి చెప్పినమాట నిజము. మనుష్యులు ఎవో భేదాలు పెట్టుకొని పరమేశ్వరుని ఉద్దేశానికి దూరులై పోతూ ఉన్నారు. 'మీరు ఆనందముకోసము సృష్టింపబడ్డారు. తనివిదీరా ఆనందించండి' అని పరమేశ్వరుని ఆదేశమైతే వీళ్లు దానికి భిన్నముగా నడుస్తూ ఉన్నారు.

భిన్న స్వరూపములలో ఏకస్వరూపము—ఆనందము—ప్రస రించి మధురశ్రుతి గీతముతో నిర్వికల్ప పరమార్థము దగ్గిరికి ఆహ్వానించుతూ ఉన్నా తారతమ్య ఫలసిద్ధి బాధతో అనుభ వించే తెలివితక్కువ లోకానికి శ్రుతిగీతి వినిపించడములేదు. అయినప్పటికి గాలివలె వ్యాపించి ఉన్న యథార్థస్వరూపము జాలితో బాధలోకూడా తన అనుభవము కలిగించుతూ ఉంది జీవులకు.'

బెన్ భావావేశముతో, 'సరేకాని ఆ పిచ్చుకలు చూడండి. వాటిలోకూడా మీ గూఢమైన మాటలలోని తెలియని అర్థము సులభముగా స్ఫురిస్తూఉంది. ఆ జీవులకున్న ఆనం దము కూడా లేదు పాపము ఈ మనుష్యునికి. ఏమో తాము సృష్టిలో అగ్రస్థానము వహించామని మురిసిపోతూ వుంటారు.'

అప్పుడే యొక సల్లనిపిల్లి యటు బోవుచున్నది.

రమణ 'పిల్లిని మనము నీచజంతు వంటాము. దానికున్న సుఖముకూడా లేదు వీరికి. ఎదో పొడిచివేస్తామని గోతులో పడుతున్నారు. జంతువు లది అజ్ఞానముతో కూడిన ఆనంద మట. వీరిదేమో మహాజ్ఞానపూర్వకమైన సంతోషమట. పాపము, మానవప్రపంచము దినదినము అధో లోకము పాల వుతూ ఉన్నదని ఎన్నో యుగాలునుంచీ చూస్తూఉన్న సము ద్రుడు ఎంత విచారిస్తూ ఉన్నాడో. ఆ విచారమే కాబోలు ఆ ఘోష.'

బెస్ కల్పితరోషముతో 'ఇప్పుడు మీకా విచారమెం దుకు. నాకు జవాబు చెప్పండి' అని యతని పెదవులపై ముద్దిడినది.

రాధారమణ ప్రత్యుత్తరముగా చుంబనము గొన్నాడు.

బెస్ సంఫుల్లహృదయయై యిట్లు భావించుకొన్నది 'ద్రాక్షాసవమున కింత పారవశ్యము కలిగించే శక్తి ఉందా?'

అప్పుడే రాధారమణకు ద్రాక్షాసవము స్మృతి గోచర మైనది. గాలి వీచుటచే బొగడపూలు ఐక్యహృదయులైన సతీ పతులపై బడినవి. ఒకే హృదిఅని సమీరశబ్దమున నస్పష్ట ముగ వినిపించినది.

రాధారమణ కొంతదూర మరిగి 'ఫ్ర్యాన్' అని సన్నని కంఠముతో సేవకుని బిలిచి 'వైన్ తీసుకురా' అన్నాడు.

శిలావేదికపై నిశ్శబ్దముగ గూరుచుండియున్న వారిప్రక్క సీసా, పాత్రనుంచి ఆతడు వెళ్లిపోయినాడు.

పాత్రలో కొంత ద్రాక్షాసవము బోసి రాధారమణ ప్రేయసి నోటి కందించినాడు. బెస్ ప్రహృష్టహృదయయై ఆస వము కొంచెము త్రాగినది. మిగిలినది తాను పుచ్చుకొని మరల పాత్రయందు ఆసవము పోసినాడు రమణ.

(పూర్తిచేయని, చేయజాలనికథ)

---

## బాలుని ఆలోచనలు:

ఒకరోజున: ఈప్రపంచ మెందుకు పుట్టింది. ఈగొడవంతా యేమిటి ఇదిలేకుండావుంటే బాగుంటుందిగా. ఒకవేళ యెందుకో ఉన్నదనుకుందాము, ఉంటేమాత్రము అందరు సంతోషంగా ఉండకూడదూ! మరి యీదుఃఖ మెందుకు? అసలే లేకుండావుంటే బాగుంటుంది. దేవుడెందుకుపుట్టించాలి యీప్రపంచం! అసలు పుట్టించకుండ వుంటే చాలా బాగుంటుంది. అతను మంచివాడంటారుగా! నిజంగా మంచివాడే అయితే యిట్లాయెందుకు పుట్టించాలి! అతను లేడేమొ? దేవుడులేకపోతే యేముంటుంది? ఏమీఉండదు. అప్పుడంతా గాలి ఉంటుందేమొ? గాలిమాత్రం యెట్లా ఉంటుంది?ఏమీ ఉండదు. ఏమీ వుండకపోతే ఎట్లావుంటుందో! ఏమిటో యిదంతా గొడవగా ఉంది.

కొన్నిరోజులు గడిచినతర్వాత: దేవుడంతా వున్నాడంటారుగదా! అతనికి పాపమంటదంటారు. అతనికి పాపముంటకపోతే యీప్రపంచములో పాపమెందుకుంది! ఇక అంతా పుణ్యమన్నమాట. ఇక పాపమనేదిలేదు. ఇదేమీ తెలియక పెద్దవాళ్లు దేవుడంతా ఉన్నాడంటారు. తప్పుచేస్తే పాపమంటారు, ఏమిటీగొడవంతాను. ఎవరినడిగినా సరియైన సమాధానము చెప్పరు. నాకంతా తెలిసికోవలెనని ఉంటుంది.

ఎవరూ నచ్చచెప్పరు. వాళ్లకేమీ తెలియదేమో! మేము పెద్దవాళ్లమని ఏమిటో వాగుతారు. వాళ్లంతా పట్టిపిచ్చివాళ్లు. ఇంకొకరోజున: ఈ చిత్రాలన్నీ దేవుడు మనసంతోషం కొరకు పుట్టించాడంటారు. మన సంతోషంకోసము పుట్టించితే మనకింకా దుఃఖమెందుకు? నిజంగా మనల్ని సంతోషపెట్టాలని దేవుడికుంటే అతని ప్రపంచంలో దుఃఖమనే మాటే ఉండదు. వీళ్లు పట్టివెర్రివాళ్లుకాని, మనకు సంతోషము కలిగించాలని దేవుడికివుంటే నిమిషంలో అంతా సంతోషమే చేసివేస్తాడు. అతను తలుచుకుంటే యెంతపని, ఇవన్నీ పుట్టించాలా ఏమిటి? ఇల్లా చెయ్యడానికి యేదో కారణముంటుంది. అదేమిటో తెలుసుకుందామంటే తెలియదు. ఎవరినైనా పెద్దవాళ్లు అనేవాళ్లనడిగితే ఏమిటో పిచ్చిసమాధానాలు చెప్తారు. చెప్పేది వాళ్లకూ తెలియదు. నాకూ తెలియదు. నాకేమీ తెలియడంలేదూ అంటే పెద్దవాడవైనతర్వాత తెలుస్తుంది అంటారు. ఏమి తెలుస్తుందో! ఏమియేమిటో! ఇదంతా గోలగావుంది.

మరొకరోజున: ఎవరూ పెళ్లి చేసుకోకుండా వుంటే పక్షులు, మృగాలు, మనుష్యులు, అందరూ మానివేయాలి పెళ్లి. మానివేస్తే ప్రపంచం వృద్ధికాదు. అప్పుడు దేవుడికి శాస్తిఅవుతుంది బాగా. లేకపోతే యెందుకీ గొడవంతా దేవుడికి. ఒకణ్ని యేడిపిస్తాడు. ఒకరిని నవ్విస్తాడు. కొందరిని పుట్టిస్తాడు, కొందరిని అమాంతంగా చంపివేస్తాడు.

వాడికేమైనా పిచ్చిపట్టిందా యేమిటి! అప్పుడు ప్రపంచం మీదవున్న జీవులన్నీ నాశనమవుతారు. మళ్లీ పుట్టిస్తాడేమొ గొడవ. మళ్లా పుట్టిస్తే మళ్లా వాళ్లంతా అల్లాగే చెయ్యాలి. ఎన్నిసార్లుపుట్టించినా అన్నిసార్లు అందరూ అల్లాగేచెయ్యాలి. అప్పుడు ఆదేవుడికి బుద్ధివస్తుంది. విసుకెత్తి పుట్టించడము మానివేస్తాడు...బలే పన్నాగం పన్నాను. (గంతులువేస్తాడు)

మరికొన్ని రోజులైనపిమ్మట: ప్రహ్లాదుడు మంచివాడంటారు. ఏంమంచి! వాడిమొకంమంచి! వాడు భక్తుడట, ఏం భక్తి! విష్ణు అంతా ఉన్నాడట. విష్ణుపేరు తలిస్తే పుణ్యమొస్తుందీ! శివుడిపేరు తండ్రి తలవ కూడదూ? శివుణ్ణి తలిస్తే పుణ్యము రాదుకామాసు! వాడికా భేదం యెందుకు. అంతటికి మూలం దేవుడున్నాడు, వాడినే తలవ కూడదూ! విష్ణు ప్రహ్లాదుడి తండ్రిని చంపివేశాడట. శివుడు ప్రహ్లాదుణ్ణి చంపలేకపోయాడు కామాసు! విష్ణుఅంతా వున్నాడట: శివుడు లేడా యేమిటి? విష్ణు నిజంగా దేవుడేఅయితే వాడి తండ్రి మనస్సు నిమిషంలో మార్చివేయవచ్చునుగా! మనస్సే మార్చలేకపోయాడు కామాసు పాపము! లేకపోతే తోచలేదేమొ! శివుడే దేవుడయితే ప్రహ్లాదుడి మనస్సు మార్చివేయు వచ్చునుగా, అతనికీ తోచలేదు కామాసు, పాపము! వీళ్లందరి పైన వుండే అసలు దేవుడు ఉన్నాడుగా! అతను వచ్చి వీళ్లిద్దరి చిల్లర దేవుళ్లనీ తనవైపు మార్చివేసుకోరాదూ! ఏమిటో, ప్రపంచమంతా పిచ్చిలో పడి కొట్టుకుంటూంది.

ఇంకొకసారి: ఇదంతా యెందుకు పుట్టించాలి? యేమీ తోచక చేసిన పని అయివుంటుందా! లీలకోసము పుట్టించాడట. లీలకోసము పుట్టిస్తే సంతోషం, విచారం యెవరికీలేకుండా పుట్టించ కూడదూ! రాళ్లమాదిరిగా ప్రాణంలేకుండా పుట్టించి వాటితో గంతులువేయించి చూచి సంతోషించరాదూ! సూర్యుడితోపాటు కిరణాలు ఉన్నట్లుగా దేవుడితోపాటు జీవులుకూడా వున్నయ్యట. ఇదేదో కొంచెము సమాధానం గానే వుంది. ఇక దేవుడు పుట్టిస్తున్నాడంటారు, ఎందుకీ పిచ్చి వాళ్లు. పుట్టిస్తున్నాడట, చంపుతున్నాడట. పాపంచేసితే నరకంలోకి తోసి యముణ్ణి దండించ మంటాడట. యముడు దండించకపోతే తను దండించకూడదూ! ఇన్ని పనులు చేయగా లేంది దానికొక నౌకరు కావలసి వచ్చాడు కామాసు! పుణ్యం చేసే తనదగ్గిరికి తీసుకు వెళ్తాడట. సూర్యుడికి కిరణాలు లాగు దేవుడికి జీవులంటారు, మళ్లా, పుట్టిస్తున్నాడని కొంత సేపటికి అంటారు, కొంచెంసేపు దేవుడంతటా ఉన్నాడంటారు: నిమిషానికొకమాట—యమలోకంలో మాత్రం దేవుడుండడు కామాసు! అంతటా ఉన్నాడంటారుగా! ఏదినమ్మవలి, ఏదినమ్మకూడదు! నోటికి వచ్చినట్లల్లా అంటారు.

ఒకరోజు ఉదయం: అబద్ధ మాడితే పాప మంటారు. అబద్ధ మాడేది, ఆడించేది ఎవరు! అంతటా అతనేగా ఉంది. తను ఆడించినట్లు ఆడుతూంటే అందులో పాప మెక్కడుంది!

మరోకసారి : ఆపెద్దవాళ్లు అనే పెద్దమనుషులు చెప్పే మాటలు వింటే పిచ్చి తలకెక్కుతుంది కూడాను. ఇక ఈ రోజునుంచి నేను వాళ్లమాట లెక్కచేయను. కడుపునిండా తిని ఒక పిల్లంగ్రోవి కొనుక్కుని పాడుకుంటూ, గంతులు వేస్తూ కాలం గడుపుతాను. అదేసుఖం ఈపిచ్చివాళ్లు ఉన్న చోట ఉంటే నాకుకూడా పిచ్చియెత్తుతుంది. ఆటలాడుకుంటూ, పాటలు పాడుకుంటూ, విసుగెత్తి ఆకలి వేసినప్పుడు భోంచేసి, మరలా ఆటలు, పాటలు—ఇంతకు మించిందిలేదు.

# ఆంధ్రహృదయము

కర్త: నరహరిశెట్టి వెంకటరత్నంగారు

కొన్ని అభిప్రాయములు:

ఆంధ్రహృదయము ఆంధ్రులభాషలోని మాధుర్యమును, ఆంధ్రుల సంగీతములోని తియ్యందనమును, ఆంధ్రసంస్కార హృదయములోని పవిత్రతను వెల్లడిగావించుచున్నది. కృతికర్త సాంఘిక ప్రపంచములో విచార వృక్షముల గనఁ రచియున్నాడు. ...... ప్రపంచమానందమయముగుటకు ముందుగ ప్రవిమలప్రేమమయమగుట అవసరమని స్పష్టముగ చెప్పియున్నారు. హృదయజనితమైన యభిప్రాయములు కొండచరియల గీతాగానముతో జరజరమని ప్రవహించు సలిలములపోలిక నిరాఘాటముగు వృదుల శైలిని పొందుపరుపబడినవి: సమదర్శిని, మదరాసు.

నవల ఏరీతిగా రచిస్తే ఇంపుగా ఉంటుందో ఆశ మీరు సూచించినట్లు నాకుతోచింది. అంతేకాకుండా అందులో పాత్రలు ఆదర్శప్రాయులుగా ఉన్నారు: చింతా దీక్షితులుగారు, బి. యె. యల్. టి.

Some of the descriptive passages in the book are exceedingly poetic and put me in mind of the beautiful ideas expressed by the English poets of the Romantic period.......

But for this small drawback—clloquial terminology—I would have pronounced your rhetoric as supremely beautiful, sumptuously full-blooded, spontaneously flowing and aptly psychological: J. Satyanarayanamurty garu M. A., Calcutta.

అదియొకింతవఱకు సాంఘిక విప్లవమును సూచించు ఆవేశగ్రంథ మయ్యు, సున్నితపు భావములు చిందనాడినదగుటచే హృదయగభీరమై చక్కని కలాశకలముగ నాకుఁ బొడఁగట్టినది. ............... "పిల్ల వాయువుచే అల్లలనాడు అరటిమువ్వవలె కదలుచున్న ఆమె మోవిచూచి రాధాకృష్ణుని యౌవన హృదయ ముద్విగ్నమైపోయినది" మున్నగు చోట్ల మిక్కిలి లలితమగు నూహ లేపారినవి: కవికొండల వేంకటరావు గారు, బి. యె. బి. యల్.

సంఘసంస్కార ప్రియులయిన ఆంధ్రయువకుల హృదయముల లోను, ఆంధ్రయువతీమణులహృదయములలోను, ఇటీవల బయలుదేరుచున్న నూతనభావాలను ఈ 'ఆంధ్రహృదయము' నందుగ్రంథకర్తగారు ఇమిడ్చి యున్నారు: కాంగ్రెస్ పత్రిక.

శైలినిబట్టి ఆంధ్రభాషయందిది యొకక్రొత్తగ్రంథమని చెప్పవచ్చును. ఈగ్రంథము పఠించునపుడానందముట్టిపడుచుండును. గ్రంథముద్రణము కూడ నూతనరూపమును దాల్చి సర్వాంగసుందరముగానున్నది: నీలగిరి, నైజాం.

గ్రంథనామమునకు తగినట్లుగానున్న యిందలికథ రసవత్తరముగ నుండుటయేకాక, ఆంధ్రోద్యమప్రాబల్యమునకును, ఆంధ్రుల ఆత్మవిశ్వాసమునకును తోడ్పడునట్టిదిగానున్నదని చెప్పదగును. ముఖ్యముగ నిందు గ్రంథకర్తగారు ప్రతిబింబింపజేసిన విశాలభావములు సంస్కారప్రియులకు నూతనోత్సాహమును, పూర్వాచారపరాయణులకు మానవసౌజన్యము యొక్క పరమావధిని చవిజూపించుచున్నవి. ప్రస్తుతనవయుగమున ఆంధ్రత్వమును సానబెట్టవలసిన సమయమున, సర్వమానవ సౌభ్రాతృత్వ మును సమకూర్పవలసిన అవసరమున నిట్టి అమూల్యగ్రంథరాజముల సహాయ మెంతయు ఆవశ్యకము: తెలగపత్రిక.

Though I am not personally for such kind of style, the style is really full of life, sweet and refreshing. Secondly, you seem to be a seer who look into the future—I mean the marriage you bring about is perhaps prophetic: M. Sanjeevarow garu. author: Mogal Durbar four Vols.

ప్రాచ్య ప్రతీచీ సాంప్రదాయ సంయోగమును, ప్రాచీన నవీన నాగరికతా సమీకరణమును ఆంధ్రహృదయమున ప్రతిబింబింపజేసిన గ్రంథ కర్తగారి నవీనకార్యాచరణ మానందదాయకమై యున్నది...—ఆంధ్ర యువతీయువకులిందలి నాయికానాయకుల ప్రణయలీలలగాంచి ముగ్ధులగుటయు, అట్టి ప్రేమమూర్తు లగుటకు ప్రయత్నించుటయు సహజమే: ఎ. లక్ష్మరాజు నాయుడు గారు, Kharagpur, B. N. Ry.

“ఆంధ్రహృదయ” మేయాంధ్రహృదయమున కాహ్లాదమును గూర్చకుండును? భావగర్భితమగు కథావిధానము, పొందికయగు మీ శిల్ప చాతుర్యము, భాషాసౌష్ఠవములకు దోడు ముద్దులుగులుకు ముద్రణాధికము లచే సమస్తాంధ్రహృదయముల నలరింపజేయుచున్నది: వంటెత్తు రెడ్డి నాయడుగారు, నల్లచెరువు.

వందలు వందలు తర్జుమాలు ఒక స్వతంత్రరచనా సమర్థునియొక్క భావపూరిత గ్రంథం ముందు దిగదుడుపులు. మామిత్రులు నరహరిసెట్టి వెంకటరత్నంగారు యీదారి చూపించారు, చూపించడమే కాదు. కథల రూపకంగా ప్రచారం సులభమని చాటించారు......ఇటువంటి రత్నాలు ఆంధ్రదేశానికి వేనవేలు కావాలి: ఆంధ్రభారతి, బందరు

నవలయొక్క ఉద్దేశము ఉన్నతమయినది. ప్రేమయెట్లు జాతిమత ప్రాకారములు దాటిపోవుచుండునో యిందు చక్కగా చూపబడియెను.

సందర్భవశమున మత వైషమ్యముల దొలగించి దేశములో సఖ్యమును వర్ధిల్ల జేయుటకై బ్రాహ్మధర్మము చేయుచున్న కృషి వ్యక్తీకరింపబడినది: ధర్మ సాధని పత్రిక, గుంటూరు

It deals with the social phase of Andhra life and it seeks to unify all the sects of Andhras by drawing together all their common qualities: Bombay Telugu Samachar.

......This small story seems to be written with a view to mitigate the stringency of racial conservatism and advocate social reform......The plot is simple, the conversations are engaging and attractive and the style is colloquial but simple and natural: Hindu dated Feb. 22, 1928.

......Verily it is the heart of Andhras. A real Andhra is one who loves the whole world as his home. As such I love to see all Andhras rising above all limitations of castes and creeds—embracing the Humanity in the arms of universal love. Such souls alone are the rarest and choicest flowers in the garden of the Almighty. May you ever shine as an innocent flower radiating its fragrance far and near: His Holiness Swami Omkar, Founder of Sri Santi Asram, Thotapalli Hills near Pithapuram.



